సాయిబాబు 2

# పునర్జన్మ

## 'వింధ్యావాసిని'



చక్రవర్తి:

జీవితంలో ప్రేమించడం అంత పిచ్చిపని, ఆడదాన్ని నమ్మటం అంత తెలివి తక్కువతనం మరేదీ వుండదని ఒకసారి ప్రేమించి, నష్టపోయాక గానీ తెలిసి రాలేదు నాకు.

చదువుకునే రోజుల్లోనే, ఒక అందమయిన అమ్మాయిని ప్రేమించాను. ఆ అమ్మాయీ నన్ను నిజంగా ప్రేమించిందనే అనుకున్నానే గానీ, తనలో వున్నది అందమయిన మనసుకాదని అనుకోకుండా తెలుసుకున్నాను. ఎందరో నాచుట్టూతా వున్న స్నేహితుల్లాగే, ఆమే నాడబ్బు కోసమే నన్ను పట్టుకున్నదని తెలిసి నా మనసు విరిగి పోయింది.

ఈ లోకంలో నాకున్నది అమ్మ ఒక్కతే. అందుకనే బుద్ధెరిగి నప్పట్నించీ నేనావిడ మాటనెప్పుడూ కాదనకుండా వస్తున్నాను. ఆవిడకీ నే నొక్కణ్ణే కావటం వల్లనేమో, ఆమె నామనను నొప్పిం చటమంటూ ఎప్పుడూ జరగలేదు.

మనిషి స్వార్థం పుట్టుకతోటే వస్తుందేమో. నా జీవితాన్ని ఆనందంతో నింపుకోవాలనే స్వార్థంతో నేను సుకన్యను ప్రేమిస్తే, ఆమె నా సంపదని అనుభవించాలని నన్ను కోరుకున్నది. ఆలో చిస్తే ఎవరి స్వార్థం ఎక్కువో నాకర్థం కాదు.

ఆఖరుకి అన్నిటి కంటే అత్యున్నతంగా ఎంచబడే తల్లి ప్రేమలో కూడా స్వార్థం ఉండక పోదేమో అనిపిస్తుంది. నా చదు వయి, చదువుకీ అంతస్థుకీ తగ్గ ఉద్యోగం అయేక మొదలు

పెట్టింది అమ్మ పెళ్ళి చేసుకొమ్మని.

ఇన్నాళ్ళుగా ఒంటరిగా, పట్టుదలగా నాకోసం బ్రతుకుతూ వచ్చిన అమ్మకి, ఈ వయసులో తనకి తోడుగా వుండి సాయపడే ఒక అసిస్టెంటు కావాలి. అందుకే కోడలు రావాలని తొందర. తను రెస్ట్ తీసుకుని ఆడుకుంటూ గడపటానికి బొమ్మల్లాంటి మనవళ్ళూ, మనవరాళ్ళూ కావాలి ఆమెకి.

అందరు పెద్దవాళ్ళలాగానే, కులాలు, అంతస్థుల పిచ్చి అమ్మకి ఎక్కువే. నేను సుకన్యను పెళ్ళిచేసుకునే పరిస్థితే వచ్చి వుంటే ఆవిడ మనసుని నొప్పించేది కాదనుకుంటాను. కాని దేవుని దయవల్ల నాకా పరిస్థితి ఎదురు అవలేదు. నా ప్రేమ సంగతి గానీ, అది భగ్నమయిన విషయం కానీ నేనెప్పుడూ అమ్మకి చెప్పలేదు. కానీ ఎవరో ఇతరుల ద్వారా ఆమె అన్నీ తెలుసుకున్నదనే అను కుంటాను. ఎందుకంటే నేను సుకన్య మనసు తెలుసుకుని ఆమెకి దూరమయిన రోజుల్లో అమ్మ ముఖంలో కనిపించిన రిలీఫ్ నేను గుర్తించక పోలేదు.

నేను సర్దుకుని, మళ్ళీ మామూలుగా అవటానికి చదువయ్యే దాకా టయిమిచ్చి, అప్పట్నుంచీ మొదలెట్టింది అమ్మ పోరు-సంబంధాలు చూస్తానని. కానీ అప్పటికే, నాకీ జన్మకి పెళ్ళివద్దని నేను నిర్ణయించుకోవటం అయిపోయింది. ఎన్నో రోజులు చెప్పి, బ్రతిమాలి చూపింది. నా మొండితనానికి విసుక్కుని, నాకిక పెళ్ళయే రాత లేదని నిరాశ చేసుకుని, ఇక ఆ ప్రసక్తే మానుకుంది.

ఇప్పటికీ అప్పుడప్పుడూ ఆ విషయం ఎత్తినా, "నాకింకా ఏం పెళ్ళే అమ్మా- ముప్పయ్యేళ్ళొచ్చేస్తుంటేనూ" అనేసి, "అవేం మాటల్రా, ముప్పయ్యేళ్ళకే ముసలాడివయి పోతావా?...." అని ఆమె ఇంకా ఏదో అనేలోగా అక్కడ్నించీ తప్పుకునే వాణ్ణి.

నేనావిడ్నెంత నిరాశ పరుస్తున్నానో నాకు తెలుసు. కాని నేనొట్టి పిరికి వాణ్ణి. ఒక సారి విరిగిన మనసుని అతుక్కుని, అందులోనికి మరో వ్యక్తిని ఆహ్వానించేంత మనస్థైర్యం నాకు లేదు. అందుకే ఉదాసీనంగా ఉండిపోయాను.

IPLA133M118

కానీ అనుకోని ఓ సంఘటన నా జీవితాన్ని ఒక మలుపు తిప్పి వేసింది. ఆవాళ ఉదయం ఆరుగంటలయింటుందనుకుంటాను. ఆ టయిముకి రోజూ నాకు మెలకువయితే వస్తుంది గానీ, లేవటానికి మాత్రం బద్ధకం. అమ్మ దేముడి గదిలో ఆ టయిముకి చదివే సుప్రభాతాన్ని వింటూ పడుకోవటం అలవాటు. ఆవాళా అలాగే మగత నిద్రలో జోగుతున్న నాకు పనివాడు రంగయ్య గట్టిగా అంటున్న మాటలు విన్పించాయి.

"అమ్మగారూ! అమ్మగారూ! మనగేటుకాడ తోట్లో ఎవరో ఒక అమ్మాయి పడుందండీ" అంటున్నాడు.

గబుక్కున మంచం మీద నించీ కిందికి దిగి నాగది దాటి హాల్లోకి వచ్చాను. అంతలో అమ్మకూడా దేవుడిగదిలోంచి రంగయ్య వెనకాలే అక్కడి కొచ్చింది.

"ఏమిటమ్మా హడావుడి?" అన్నాను.

"ఏమోరా! ఎవరో అమ్మాయి మన గేటు దగ్గర తోటలో పడుందని కేకలేస్తూ వచ్చాడు. ఎవరో ఏమిటో."

"చూద్దాం పదమ్మా" అంటూ రంగయ్య వెనకాలే, అమ్మ వెంట నేనూ బయటికి వెళ్ళాను.

అక్కడ స్పృహలేకుండా పడివున్న అమ్మాయి ముఖాన్ని చూడగానే. కొన్ని క్షణాలపాటు నాదృష్టిని తిప్పుకోలేక పోయాను.

ఆ ముఖమెంత అందంగా వున్నదో సరిగ్గా వర్ణించి చెప్పేందుకు నాకు కవిత్వం రాదు. కానీ అక్కడ ఆకర్షణకంటే ఆహ్లాదాన్ని కలిగించే భావమేదో ఉన్నట్లు నాకు తోచింది. నుదుటికి కట్టు కట్టి వుంది. ఆమె వేసుకున్న దుస్తుల్ని చూస్తే కాస్త ఉన్నవాళ్ళ అమ్మాయిలాగానే కనిపిస్తూంది. వయసెంత ఉండవచ్చో సరిగ్గా చెప్పలేను కానీ ఇరవయి పైన, పాతిక్కిలోపూ వుండవచ్చు అనిపించింది.

నా ఆలోచనల్లో నేనుండగానే, అమ్మ అంది, "ఎవరోరా పాపం! కాస్త కలిగినాళ్ళ పిల్లలాగానే వుంది. ఇక్కడి కొచ్చి ఎలా పడిందో. పైని ఏమయిందో ఏమో. ఆ కట్టు ఒకటి కట్టి

ప్పంది." అమ్మకి జాలి ఎక్కువ. కష్టంలో వున్న వాళ్ళని చూస్తే అది మరింత ఎక్కువవుతుంది.

"ఏం చేద్దామమ్మా" అన్నాను.

"ఏం చేదామంటావేమిట్రా? ఎలా వచ్చిందో మన ఇంటి ముందొచ్చి పడింది. లోపలికి పట్టండి. స్పృహ వచ్చేక అన్నీ తెలుసుకుందాము." కర్తవ్యాన్ని తెలిపింది అమ్మ.

ముగ్గురమూ కలిపి లోపలికి పట్టుకొచ్చేము. గెస్ట్‌రూమ్‌లో వున్న బెడ్‌మీద పడుకోబెట్టేక డాక్టర్‌కి ఫోన్ చేశాను. ఈమధ్య టయిములో ఆ అమ్మాయిలో ఏమాత్రం చలనం లేదు. ఉచ్ఛ్వాస నిశ్వాసాలని బట్టి మాత్రం ప్రాణం వున్నట్లు తెలుస్తోంది.

డాక్టర్ తెలిసిన వాడవటం వల్ల ఎవరీమె అన్నట్లు ప్రశ్నార్థకంగా నావయిపు చూశాడు. నాకేం చెప్పాలో తోచలేదు. అమ్మకెలా తోచిందో ఏమో, "మావాళ్ళమ్మాయే బాబూ!" అంది. అంతకు మించి ఇంకేమీ చెప్పలేదు. ఆయనకెంత మాత్రం అర్థం అయిందీ నాకు తెలియదు.

పది నిముషాలసేపు పరీక్షచేసి, తన బాగ్‌లోంచి ఇంజెక్షన్ తీసి వేయాలన్నారు డాక్టర్.

రంగయ్యచేత వేడినీళ్ళు తెప్పించింది అమ్మ. ఇంజెక్షన్ వేశాక. "ఈమెకి ఏదో ఆక్సిడెంట్‌లో బాగా బలమయిన గాయమే తగిలినట్లుంది. మెదడు బాగా దెబ్బతిన్నట్లు తోస్తూంది. ఒక పది నిముషాల్లో మెలకువ వస్తుంది. మాట్లాడి చూద్దాము" అంటూ టేబిల్ మీకున్న మాగజైన్ ఒకటి చేతిలోకి తీసికొని రిలాక్స్ అయి కూచున్నాడు డాక్టర్.

"నువ్వెళ్ళి ముఖం కడుక్కోరా. ఇంతలో కాస్త కాఫీ పెట్టిస్తాన్నేను" అంటూ అమ్మ లోపలికి దారి తీసింది.

నిజానికి ఆ అమ్మాయి లేచేదాకా నాకు అక్కడ్నించి వెళ్ళాలని లేదు. ఎవరో ఏమిటో తెలుసుకోవాలని ఆతృతగా వుంది. కానీ నా ఆత్రుతని అమ్మకి చూపటం ఇష్టంలేక, లోపలికి వెళుతూ "నువ్వెళ్ళి నీ పని చూసుకోరా" అన్నాను రంగయ్యతో.

నిజానికి వాడూ నేనున్న స్థితిలోనే వున్నాడు. అయినా నేను చెప్పేను కనుక ఏమీ అనలేక బుర్రగోక్కుంటూ వెళ్ళిపోయాడు.

తిరిగి నేనూ, అమ్మా వచ్చేసరికి కళ్ళు తెరచి చూస్తూంది ఆ అమ్మాయి. మాట్లాడించి చూడమన్నట్లు అమ్మవయిపు చూశాడు డాక్టర్.

ఫ్లాస్కులో తెచ్చిన కాఫీని కప్పులోకి వంచుకుని వెళ్ళి పక్క మీద కూచుని, "లేచి కాస్త కాఫీ తాగమ్మా" అంది అమ్మ.

కుడిచేతిని ఆసరాచేసుకుని లేచి కూచోబోయిన ఆ అమ్మాయి, "అబ్బా" అని మూలుగుతూ మళ్ళీ పడుకునుండి పోయింది.

డాక్టర్వచ్చి మెల్లిగా లేపి కూచోబెట్టి కప్పుని ఆమె ఎడం చేతికి అందించాడు. ఆమె కాఫీ తాగటం అయాక మెల్లిగా వంచి పడుకోబెట్టి, "చెయ్యి నొప్పిగా వుందామ్మా?" అని అడిగాడు.

అవునన్నట్లు తల వూపింది.

భుజం దగ్గిర్నుంచీ పట్టి పరీక్షచేస్తూ, మోచేతి కిందుగా చూపి, "ఇక్కడ ఎముక కాస్త చిట్లినట్లుంది. సాయంత్రం మా కంపౌండర్ వచ్చి కట్టుకడతాడు. మామూలుగా అవటానికి కనీసం పదిరోజులు పట్టొచ్చు. అంతదాకా వీలయినంత వరకూ చేతిని కదిలించకుండా వుంటే మంచిది" అని చెప్పాడు డాక్టర్.

"బాగా అలసిపోయి వుంది. ఇప్పుడంత ఎక్కువగా మాట్లాడించక పోవటమే మంచిది. ఎలా వున్నదీ మధ్యాహ్నం ఒక సారి ఫోన్ చేయండి." అని చెప్పి వెళ్ళిపోయాడు.

వింతగా కళ్ళని తిప్పి చుట్టూ చూస్తున్న ఆమెని, "ఎవరమ్మా నువ్వు?" అని అడిగింది అమ్మ అనునయంగా. అమ్మ ప్రశ్న ఆమెకి అర్థం అయినట్లు తోచలేదు.

ప్రశ్నార్థకంగా అమ్మ ముఖంలోకి చూసింది. "నీపేరేమిటి? మీవూరేది?" అంది మళ్ళీ అమ్మ.

"ఏమో? నాకేమీ గుర్తులేదండీ. ఇక్కడి... కూడా తెలీదు," అంది. ఆమె స్వరం బలహీనం...

అమ్మ ఏమో చెప్పబోయింది. నేను వారించాను. "పోనీలే అమ్మా! నిదానంగా మాట్లాడుకోవచ్చు. ఆమెని కాస్త రెస్ట్ తీసుకోనిద్దాం" అన్నాను.

నా మాటలు వినేదాకా నేనున్నట్లు కూడా ఆమెకి తెలీదనుకుంటాను. నా స్వరం విన్పించగానే నావయిపు తల తిప్పి చూసింది. ఆ చూపులో కృతజ్ఞత లాంటి భావమేదో కదిలినట్లు తోచింది నాకు. తిరిగి మళ్ళీ కళ్ళు మూసుకుంది అలసి పోయినట్లుగా.

అప్పటికే టయిము ఎనిమిది గంటలు దాటిపోవటం వల్ల అమ్మ నాకు టిఫిన్ తయారయిందో లేదో చూస్తానని వంటగదిలోకి వెళితే, నేను స్నానానికి వెళ్ళాను.

* * *

రెండు మూడు రోజులపాటు రోజూ ఒక్కసారి ఆ అమ్మాయిని చెక్ చేసి వెళుతున్నాడు డాక్టర్. అంతవరకూ మేమెవరమూ ఆమె నెక్కువగా ప్రశ్నించలేదు.

అమ్మను చూస్తేనే నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఎవరో ఏమిటో తెలియకున్నా, దారిన వెళ్ళే ఈ అమ్మాయి మీద ఆమె కెందుకింత జాలి కలిగిందో నాకర్థం కాలేదు. నేనైనా ఒకటి రెండు సార్లు ఎందుకు తెచ్చిపెట్టుకున్నామా ఈ తద్దినాన్ని అనుకున్నానుగానీ, ఆవి ఢలా అనుకున్నట్లు మాత్రం కన్పించలేదు. అవును. ఒక మనిషికి మరొకరి మీద అభిమానమనేది ఎందుకు, ఎలా కలుగుతుందో చెప్పటం కష్టం అనిపించింది నాకు.

ఆవేళ భోజనం పెట్టొచ్చన్నారు డాక్టర్. పని మనిషి సాయంతో స్నానం చేసింది ఆమె. చెయ్యికట్టు మాత్రం అలాగే వుంది. అమ్మ కలిపిచ్చిన చారూ, అన్నం మంచం మీద కూచునే స్పూన్‌తో తింది ఆమె.

భోజనం అయాక మెల్లిగా మొదలు పెట్టిందమ్మ ఇంటర్వ్యూ. "చూడమ్మాయ్! నాలుగు రోజులక్రితం నువ్వు మా తోటలో పడి ...ఉకొచ్చాము. అప్పటికే నీ తలకి కట్టొకటి వుంది. ...దవి డాక్టర్ ఇవాళే పూర్తిగా విప్పేశారు.

జ్యోతి

నువ్విక్కడి కెలా వచ్చావో ఏమిటో. నువ్వెవరో అని మాకు ఆదుర్దాగా వుంది."

"ఏమో అమ్మా! నాకేమీ తెలీదు. ఇక్కడికొచ్చాక ఈ గదిలో కళ్ళు తెరిచి చూడక ముందు నేనెక్కడున్నానో, ఎవర్నో నాకేమీ గుర్తులేదు. ఈ మూడు రోజులుగా ఆలోచిస్తూనే వున్నాను ఈ విషయం. ఆలోచించే కొలదీ తలలో నరాలు లాగుతున్నట్లుంది కానీ ఒక్కముక్కా గుర్తుకు రావటం లేదు." దీనంగా వుంది ఆమె స్వరం.

మాట్లాడుతూనే మధ్యలో రెండుసార్లు నావయిపు చూసింది. ఆమె చూపులని అర్థం చేసుకుందేమో అమ్మ. "వాడు మా అబ్బాయి. పేరు చక్రవర్తి. ఏదో ఎలక్ట్రికల్ సామాన్లు తయారు చేసే కంపెనీకి మానేజరుగా వున్నాడు.... అన్నట్లు కనీసం నీపేరయినా గుర్తులేదా తల్లీ" అంది అనునయంగా.

లేదన్నట్లు తల అడ్డంగా వూపిందామె.

"పోనీలే! మేమే నీగురించి ఏం చేయాలో ఆలోచిస్తాము. నువ్వేమీ దిగులు పెట్టుకుని ఆలోచించకు. అసలే నీ ఆరోగ్యం బాగా దెబ్బ తిని వుంది.... ఇంతలో నిన్నెలా పిలవాలి? పేరయినా తెలీదంటావే!.... పోనీ సంధ్య అని పిలుస్తాము. మీవాళ్ళెవరో తెలిపి నీకోసం వచ్చేదాకా నీపేరు సంధ్య..... సరేనా.... ఇక విశ్రాంతి తీసుకో" అంటూ లేచిందమ్మ అక్కడ్నించి.

అమ్మ మాటలు నాకు నచ్చాయి. అమ్మ కట్టుకునే తెల్లచీరని కట్టుకుని పాలిపోయిన ముఖంతో బెదిరిన లేడిలా చూస్తున్న ఆమెని చూస్తే నాకూ జాలివేసింది.

అమ్మ వెనకాలే నేనూ బయటికొచ్చాను.

"ఏమీ గుర్తు లేదంటుందే. ఏం చేద్దామమ్మా మరి. ఎన్నాళ్ళని ఇలా మన ఇంట్లో పెట్టుకుంటాం?" అన్నాను.

"సరే లేరా. నీకన్నీ తొందరే. ఏదో ఏక్సిడెంట్ అయి బాగా దెబ్బతిని వుందని డాక్టర్ చెప్పనే చెప్పాడు కదా? కొన్ని రోజులాగి చూద్దాం. నిదానంగా ఏమయినా తన గుర్తుచేసు

గలుగుతుందేమో? ఎవరో కలవారి ఇంటి అమ్మాయిలాగే వుంది. నాలుగురోజులు ఉంచుకున్నంత మాత్రాన మనకి పోయేదేముంది?"

ఇంతకీ అమ్మ 'సంధ్య' అనే పేరెందుకు పెట్టిందో చెప్ప లేదుకదూ? ఆమెకి ఆ పేరంటే చాలా ఇష్టంట. తనకి ఓ కూతురు పుడితే ఆపేరు పెట్టుకోవాలని వుండేదట. పాపం ఆ కోరిక తీరనే లేదామెకి. నేనొక్కణ్ణే సంతానం అవటాన.

సంధ్యని గురించి అమ్మ తీసుకున్నంత తేలిగ్గా నేను మాత్రం తీసుకోలేక పోయాను. అమ్మకి తెలీకుండా సాయంత్రం వెళ్ళి డాక్టర్ని కలిశాను. మొదట్నించీ ఆవిడ్ని పేమెలా చూపిందీ. తీసుకొచ్చిందీ అన్నీ చెప్పుకొచ్చాను.

"ఏదడిగినా నాకేమీ గుర్తులేదంటుందా అమ్మాయి. ఇంతకూ ఆమె కండిషన్ ఏఁవిటి డాక్టర్? ఎప్పటికయినా ఆమెకి గతం అనేది గుర్తు వస్తుందంటారా?"

"ఏ విషయం నేను గట్టిగా చెప్పలేను చక్రవర్తిగారూ! ఆమె ఏదో ఏక్సిడెంట్‌లో దెబ్బతిని మతి కోల్పోయిందని మాత్రం చెప్పగలను. నిదానంగా ఆరోగ్యం కోలుకుంటే గుర్తు రావచ్చు లేక ఎప్పటికీ గుర్తు రాకనే పోవచ్చు. దీనికి డాక్టర్‌గా నేను చేయగలిగిందేమీ లేదు."

"పోనీ ఆమె ఫోటో పేపర్లో ప్రకటిస్తే ఎలా వుంటుం దంటారు? నా అడ్రస్ ఇస్తే వాళ్ళ వాళ్ళెవరో వస్తారు కదా వాళ్ళని చూస్తే అయినా ఏమయినా గుర్తుచేసుకో గలదేమో కదా?"

కొద్దిగా ఆలోచించి ఇలా అన్నాడు డాక్టర్.

"నిజంగా మీ ఉద్దేశం ఏమిటి? ఆమెని త్వరగా వదిలించు కోవాలనుకుంటుంటే మాత్రం వాళ్ళ వాళ్ళెవరో వచ్చి తీసి కెళ్ళాలంటే పేపర్లో ప్రకటిస్తే మంచిదే గానీ........"

"అహా! అలా కాదు డాక్టర్. వదిలించుకోవాలని కాదు. వాళ్ళవాళ్ళెవరో ఆదుర్దాపడుతుంటారు కదాని. అంతే. కానీ అని ఆగిపోయారే. ఏఁవిటో చెప్పండి. సంకోచం వద్దు."

"ఫ్రాంక్‌గా నా అయిడియా చెప్తాను వినండి. చూడగా,

నాకు ఈమె ఏక్సిడెంట్ అయాక, తనవారి మధ్యనే వుండి. వాళ్ళ ఆదుర్దా, ఆత్రుతలతో నలిగిపోయి, ఆ మెంటల్ స్ట్రెయిన్‌ని తట్టుకోలేకనే ఆ పరిసరాలనించీ పారిపోయి వచ్చిం దేమో అనిపిస్తూంది.

"అలా వచ్చే మీ ఇంటిదగ్గిర తనకు తెలీకుండా పడిపోయి వుండవచ్చు. అంతకుముందు ఓ రెండురోజులయినా రైలులోనో, బస్‌లోనో ప్రయాణం చేసి వుండవచ్చు. ఏదీ ఇదమిత్థంగా చెప్పలేను.

"కానీ ఒకటి మాత్రం చెప్పగలను. ఈ పరిస్థితిలో— అంటే ఆమె పూర్తి మానసికంగా తేరుకోలేదనే నా ఉద్దేశం— వాళ్ళవాళ్ళని పిలిపిస్తే—వాళ్ళు మీలా తాపీగా ట్రీట్ చేయరు ఈమెని. వాళ్ళ అభిమానం, ఆత్రుతలతో ఆమెను ముంచెత్తు తారు. దానికామె మెదడు తట్టుకోలేక మతిభ్రమించవచ్చు. లేదా ఇక్కడ్నించీ కూడా పారిపోవటానికి ప్రయత్నించవచ్చు.

"ఇవేమీ జరక్కుండా చూడాలంటే ప్రస్తుతానికి వాళ్ళ వాళ్ళకి దూరంగా ఉండటమే ఆమె ఆరోగ్యానికి మంచిది. కనీసం ఒక నెలరోజులయినా ఆగితే అమె ఏమాత్రమయినా గుర్తు చేసుకోగలదేమో తెలుస్తుంది. అటు తరవాత మీరన్నట్లు పేపర్లో ప్రకటించి చూడవచ్చు....ఆపయిన మీ ఇష్టం."

తను చెప్పగలిగిందంతే అన్నట్లు ముగించేడు డాక్టర్. మవునంగా ఆయన చెప్పిందంతా విని, "అలాగే డాక్టర్, మీరు చెప్పినట్లే చేస్తాము." అని ఇంటికి బయలుదేరాను.

డాక్టర్‌తో మాటల్లోపడి ఇల్లు చేరేసరికి బాగా పొద్దు పోయింది. అమ్మ భోంచేయకుండా నాకోసం చూస్తూంది.

ఇంట్లో అడుగుపెట్టగానే, "ఆ అమ్మా యేం చేస్తోంద"ని అడగకుండా ఉండలేక పోయాను.

"ఎవరూ? సంధ్యా. ఏడింటికే భోంచేసి కాస్సేపు ఏదో చదూకుని నిద్రపోయిందిరా.... అవునూ ఇవాళింత ఆలస్యం అయిందేం?" ఎంతో మామూలుగా అంది అమ్మ.

ఆమెకి వీలయినంతవరకూ అబద్ధాలు చెప్పకుండా వుండటం నాకు ఇష్టం. అందుకని భోజనం చేస్తూ అంతా చెప్పాను.

"అయ్యో పాపం! వాళ్ళ అమ్మా నాన్నా ఎంత ఆదుర్దా పడుతున్నారో! అయినా డాక్టర్ చెప్పిందీ కరెక్టేకదా? పోనీ ఓ నెలరోజులాగి చూద్దాం. ఇంతలో మునిగిపోయిందేముంది? .... అన్నట్లు మరిచే పోయాన్రా. ఆ అమ్మాయి బాగా చదువుకున్నట్లే వుంది. ఏదో ఇంగ్లీషు పుస్తకం చదువుతుంటే చూశాను ఇందాకా" అంది అమ్మ.

"అహా! అలాగా" అన్నాను పరధ్యానంగా.

* * *

సంధ్య మా ఇంటికొచ్చి నెల రోజులయింది. ఆమెకి మేమూ. మాకు ఆమే బాగా అలవాటు అయిపోయాము. మును పటిలా నన్ను చూసి బెరుగ్గా వుండటంలేదు. తన గతాన్ని గూర్చి తప్ప ఏం అడిగినా సరిగ్గానే సమాధానం చెబుతుంది. ఈ మధ్య కాలంలో నా దగ్గరున్న ఇంగ్లీషు, తెలుగు నవలలు చాలా మటుకు చదివేసింది.

ఎంత వరకూ చదువుకున్నదీ అయినా గుర్తుందేమో అని అడిగి చూశాను. లాభం లేక పోయింది.

పోనీ ఈ పుస్తకాలిన్ని చదువుతున్నావ్ కదా, బాగా అర్థ మవుతున్నదా అని అడిగితే, అర్థమవుతున్నందుకేగా చదువుతున్నది అన్నది నవ్వుతూ.

అప్పుడప్పుడూ తన గతాన్ని గూర్చి ఆలోచిస్తున్నట్లు కన్పించేది కానీ, మాతో మాత్రం ఒక్కమాటయినా బయటపడేది కాదు. ఎక్కువగా ప్రశ్నిస్తే మేమేదో తనని వదిలించు కోవాలని చూస్తున్నామనుకుంటుందేమోనని వూరుకున్నాము. చిత్రంగా అమ్మ కూడా ఏమీ అడిగేదికాదు. ఎందుకు తగిలించుకున్నామా అని విసుక్కునేదీ కాదు.

సంధ్య వచ్చాక పదిహేనురోజులకి కాబోలు, ఇంట్లో ఓ ఇర[illegible]ం వచ్చి పడింది.

జ్యోతి

ఆవాళ వంటింట్లో వంటావిడ మాటలు కొంచెం గట్టిగట్టిగా వినిపిస్తూంటే ఏవిటా అని వెళ్ళి చూశాను.

"ఇన్నాళ్ళూ ఎవరో ఏమిటో తెలుసుకుని పంపించేస్తారేమో నని చూస్తూ వచ్చానమ్మగారూ! ఇంక నావల్లగాదు. మావాళ్ళంతా దెప్పుతున్నారు నన్ను- మాదిగదో, మంగలదో తెలుసుకోకుండా వాళ్ళు ఇంటో పెట్టుకుంటే మాత్రం, అదున్న ఇంట్లో వుండటానికి, వండి పెట్టటానికీ నీకెలా బుద్ధిలేక పోయిందీ అని. నాకివాళ్టితో సెలవిప్పించండి. వెళ్ళిపోతాను."

"అదేమిటి సుబ్బమ్మగారూ! అయిదేళ్ళనించీ మా ఇంట్లో పనిచేస్తున్నారు. మీకు మేమూ, మాకు మీరూ బాగా అలవాటు అయిపోయాము. ఇప్పుడున్న పళంగా వెళతానంటే ఎలా? అయినా ఆ పిల్లని చూసి అలా అన బుద్ధెలా అయింది మీకు? లక్ష్మీకళ ఉట్టిపడే ఆ ముఖాన్ని చూస్తే మంచి కుటుంబానికి చెందిన అమ్మాయి అన్పించటం లేదూ?"

"మీకెలా కనిపిస్తుందో ఏమో మీ ఇష్టం. నేను మాత్రం ఇక పనిచేయలేను. అంతగా కావాలంటే ఆ అమ్మాయిని పంపించేశాక పిలిపించండి. వస్తాను."

అమ్మ ఆవిడ్ని అంతగా బతిమాలటం నాకేమీ నచ్చలేదు. డబ్బిస్తే వంటమనిషే దొరకదా? "పోనీలే అమ్మా. పాపమావిడ కంత కష్టం ఎందుకు? రావలసిన డబ్బిచ్చేసి పంపించెయ్యి. మనకి వేరే మనిషే దొరక్కపోతుందా?" అన్నాను.

నా మాటలకి ఆవిడ ముఖం నల్లగా అవటం నేను గమనించక పోలేదు.

నా మాటలు ముగించి నేను వెనుదిరిగి చూసేసరికి ఎంత సేపయిందో వచ్చి సంధ్య మా మాటలన్నీ విని వెనుదిరిగి వెళ్ళి పోతూంది. ఆమె వెనకాలే నేనూ వెళ్ళాను. గబగబా తనగదిలో కెళ్ళి కూచుని ఏడుస్తూ వుంది.

ఎందుకో నాకర్థం కాలేదు. ఏమని ఓదార్చాలో తోచలేదు. ఎప్పుడు ఎలా అలవాటయిందోగానీ, ఆమెనిప్పుడు ఏకవచనంతోనే

...బోధిస్తున్నాను.

"ఏమిటి సంధ్యా ఎందుకేడుస్తున్నావ్?" అన్నాను దగ్గరగా వెళుతూ. చేతుల్లో దాచుకున్న ముఖాన్ని పయికెత్తకుండానే, "నావల్లే కదూ మీకీ కష్టాలన్నీ. నేనొక నష్టజాతకురాల్ని. నేనెవరో నావాళ్ళెవరో నాకే తెలీదు. ఆఖరికి వూరూపేరూ తెలీదు. మీ ఖర్మ కొద్దీ మీ ఇంట వచ్చిపడి. మీకు గుదిబండనయాను. నన్నెక్కడికయినా పంపించేయండి" అన్నది వెక్కుతూ.

మంచం మీద ఆమె పక్కనే కూచుని, "పిచ్చిదానా! అందుకనా ఏడుస్తున్నావ్? ఈ సుబ్బమ్మ పోతే ఈవిడ తాతలాంటి మనిషిని సంపాదిస్తుంది అమ్మ. నువ్వేం బెంగపెట్టుకోకు అనవసరంగా. ఎలా జరగాల్సింది అలా జరుగుతుంది. ఎలాగయినా మీ వాళ్ళ దగ్గిరికి చేర్చే పూచీ నాది. సరేనా?" నాకు తెలీకుండానే నా చెయ్యి ఆమె తలని నిముర్తూంది.

"ఏదీ ఒకసారి నవ్వు" అంటూ ఆశగా ఆ ముఖంలోకి చూశాను.ఆమె తల ఎత్తి నా కళ్ళలోకి చూసింది. సరిగ్గా అదేక్షణంలో గది గుమ్మంవద్ద అమ్మ నిలుచుని ఉన్నట్లు తోచితే తలెత్తి చూశాను ఉలిక్కిపడి. సరిగ్గా ఆ క్షణంలో నాచేయి సంధ్య తలమీద వుంది.

నా చేతిని వెనక్కి తీసుకుని దూరంగా జరిగేలోగా అమ్మ వెనుదిరిగి వెళ్ళిపోయింది. నాకెందుకో కాస్త భయం వేసింది. అమ్మ ఎలా అర్థం చేసుకుందోనని. ఏమనుకున్నా, అనుకోకపోయినా అయిపోయిందానికిక చేసేది మాత్రమేముంది?- అనుకుని నిట్టూర్చి పయికి లేచాను.

అమ్మ ఏమనుకున్నదీ నాకు తెలియలేదు. కారణం. ఆ విషయాన్ని గూర్చి ఆవిడ ఏమీ మాట్లాడక పోవటమే.

కానీ ఆ విషయాన్ని గూర్చి నేనే ఎక్కువగా ఆలోచించానేమో అనిపిస్తుంది. కారణం ఆ సంఘటన నా మనసులో ముద్ర వేసుకుంది. చిత్రమేమిటంటే నేను ప్రదర్శించిన చనువు చూసి సంధ్య ఏమాత్రమూ ఆశ్చర్యపడినట్లు తోచలేదు. ఆ రాత్రంతా ఆలోచించాను. ఆమెతో అంత చనువుగా ప్రదర్శించేలా చేసిన శక్తి

జ్యోతి

ఏమిటా అని.

సుకన్యతో నా ప్రేమాయణం చెడిన రోజునించీ మళ్ళీ నా జీవితంలో మరో యువతి ప్రవేశించగలదని నే నేనాడూ తలచలేదు. నాటికి నేడు, ఎవరో తెలియని అనామకురాలితో ఇంత దగ్గరెలా అయ్యానా అని నాలో నేనే ఆశ్చర్యపోయాను. ఈ సంఘటన జరిగేక గానీ, సంధ్య నా మనసుకెంత దగ్గరగా రాగలిగిందో అర్థం చేసుకోలేక పోయాను.

బాగా ఆలోచిస్తే సంధ్యకి దగ్గరవటం అనవసరంగా బంధం పెంచుకోవటమేమో అన్పించింది. ఈ రోజు కాకపోతే ఎప్పటికయినా ఆమె తన వాళ్ళ దగ్గిరికి వెళ్ళిపోయేదే కానీ శాశ్వతంగా ఇక్కడ వుండటం కల్ల. పైపెచ్చు ఆమె మనసులో నాపైనున్న భావమేలాటిదో నాకు తెలీదు. ఏదేమయినా, ఇప్పట్నించీ ఆమెకి కాస్త దూరంగా వుండటమే మంచిదని ఆరాత్రి నిర్ణయించుకున్నాను.

కానీ నా నిర్ణయం ఎంతోకాలం నిలవలేదు. మరురోజు పొద్దున్నే నేను లేచేసరికి, చీరకొంగుని నడుం చుట్టూ బిగించి, వంటగదిలో వంట చేస్తూ పీటమీద కూచుని కూరలు తరుగుతున్న అమ్మతో కబుర్లు చెబుతూంది సంధ్య.

గుమ్మంపయిన చేతులేపి నిలుచుంటూ, "అరెరే! సంధ్యకి వంటచేయటం కూడా వచ్చునా అమ్మా" అన్నాను నవ్వుతూ.

"ఏమో బాబూ, అసలే జబ్బు మనిషివి నీకెందుకమ్మా ఈ పనులు; మరో మనిషి దొరికేదాకా నే చేసుకుంటాలే—అని చెబితే నా మాట వినిపించుకోవటం లేదు." మాట లెలా వున్నా, సంధ్యపట్ల మెచ్చుకోలు విన్పించింది నాకు.

నేను జవాబు చెప్పేలోగా సంధ్యే అంది. "నాకేం అయిందమ్మా. ఎన్నాళ్ళని వూరికే కూచోను? నిక్షేపంలా వున్నాను. ఈ మాత్రం పని చేయగానే నేనేం తరిగిపోను. అసలు మీరు మరో మనిషికోసం వెతకనే వద్దు. నే చేసి పెడతాను. దగ్గిరుండి సలహాలివ్వండి చాలు. ఇంట్లో తోటపనికి రంగయ్య, అంట్లవీ తోమటానికి రాములమ్మ వుండనే వున్నారుగా" గడగడ

మాట్లాడేస్తూంది సంధ్య.

ఆమె అన్ని మాటలు అలా ఏకధాటిగా మాట్లాడ గలదని నేనసలు ఊహించనే లేదు. పూరికే కూచోవటం కంటే, లేచి తిరుగుతూ, పని చేయగలగటం వల్ల వచ్చిన ఉత్సాహం అనుకుంటాను అది.

"పోన్లే అమ్మా. పాపం చాలా సరదా పడుతూంది. చెయ్యనివ్వు. అదీ ఎలా చేస్తుందో. ఆ వంటని మనం తినగలమో లేదో ఈవాళే తేలిపోతుంది కదా?" అన్నాను హాస్యంగా.

ఏదో కూరని కలియబెట్తున్న సంధ్య నా మాటలకి ఇటు తిరిగి, చిరుకోపంతో ఉరిమి చూపింది. ఆ కోపం నాకెంతో ముచ్చటగా కన్పించింది. అలాగే ఇంకా ఏమయినా మాట్లాడుతూ నిలుచుండి పోవాలన్పించింది. కానీ ఎబ్బెట్టుగా వుంటుందేమోనని బాత్‌రూమ్ వయిపు దారి తీసాను. ఆ క్షణంలో రాత్రి నేను తీసుకున్న నిర్ణయం అసలు గుర్తు రానేలేదు.

ఆ రోజునించీ వంటపని మాత్రమే కాకుండా చేతికందిన మరెన్నో పనులు చేస్తూ మా ఇంట్లో కలిసిపోయింది సంధ్య. రానురాను అమ్మకి కుడిభుజంలా అయిపోయింది. తన మీద అమ్మ అంతగా ఆధారపడటం చూస్తే నాకు భయంవేసింది, సంధ్య వెళ్ళిపోతే అమ్మ తిరిగి సర్దుకోగలదా అని. ఆవిడ మళ్ళీ వంట మనిషి మాట తలపెట్టనేలేదు.

ఈ మధ్యని తోటలో కొత్త కొత్త పూలచెట్లూ, కూరగాయల పాదులూ కనిపిస్తున్నాయ్. ఇంట్లో కూడా ఎక్కడి సామాను అక్కడే కుదురుగా వుంటూంది. డ్రాయింగ్ రూమ్ రోజూ శ్రద్ధగా అలంకరింపబడుతూ వుంది. వీటన్నిటిలో సంధ్య చేయి ఉండటమే మార్పుకి కారణమని వేరుగా చెప్పనవసరం లేదు.

ఆఖరుకి ఆమె దృష్టి నా గదిమీద కూడా పడకుండా పోలేదు. రోజు కొక్కసారయినా నా గదిలో పుస్తకాలు, పక్కా సీటుగా సర్దేదికానీ, ఎప్పుడు చేసేదో మాత్రం నాకు తెలీదు. నేనుండగా మాత్రం నా గదిలోకెప్పుడూ వచ్చేది కాదు.

జ్యోతి

ఆవేళ ఉదయం. వంటగదిలో ఆమె వంటచేస్తూండగా చూస్తే గానీ ఆమె ఇంతదాకా అమ్మ కట్టే తెల్లచీరలే కట్టుకుంటూందని నాకు గుర్తు రాలేదు. నాలుగు చీరలు కొని తెద్దామని అన్పించింది, కానీ అమ్మ ఏమనుకుంటుందో అని సంకోచించాను.

* * *

తరవాత రెండురోజులకి సాయంత్రం ఆఫీస్‌నించీ ఇంటికి రాగానే అంది అమ్మ

"ఏమిటో అనుకున్నాగానీ. మన సంధ్య భలే మొండిదిరా. మధ్యాహ్నం నించీ చెబుతున్నాను- తయారవమని నామాట వింటేనా?"

అసలు విషయమేమిటో నాకేమీ అర్థం కాలేదు. "తయారవటమేఁవిటమ్మా? అసలెక్కడికి వెళ్ళాలనీ?" అన్నాను.

"అది కాదురా. దీపావళి పండుగ ఇంకో వారం రోజులేగా వుంది. ఇవాళ నిన్ను కొత్తబట్టలు తెచ్చుకోమని పొద్దుట చెప్పానా? సాయంత్రం నువ్వెళ్ళేటప్పుడు నీవెంటొచ్చి, తననీ నాలుగు చీరలు తెచ్చుకోవే అమ్మాయీ అన్నాను. ఊహూఁ! ససేమిరా అంటూంది. అంతగా అవుతే నువ్వే తెచ్చివ్వాలిట. తను మాత్రం రాదట నీతో."

"అదేం పాపం. ఉన్నట్టుండి అంత భయం పట్టుకుంది నేనంటే" అన్నాను సరదాగా నవ్వుతూ.

"అదేమో బాబూ తననే అడుగు. నే కాఫీ పట్టుకొస్తానుండు" అంటూ వెళ్ళిపోయిందమ్మ.

చప్పుడు కాకుండా వెళ్ళి తనగది గుమ్మం దగ్గిర నిలుచుని లోనికి తొంగి చూశాను. మంచం మీద పడుకుని ఏదో పుస్తకం చదువుకుంటూంది.

"సంధ్యా!" అని పిలిచాను. గబుక్కున లేచి మంచం మీద సర్దుకుని కూచుంది. ఏమిటన్నట్లు నా వైపు చూసింది.

"అమ్మ నాతో బజారు వెళ్ళమంటే రానన్నావటగా? ఎందుకని? ఏం నేనంత భయంకరంగా కనిపిస్తున్నానా నీ కళ్ళకి" లోపల నవ్వుకుంటూ పయికి మాత్రం సీరియస్‌గా అన్నాను.

"అహఁ: అలా కాదు. అనవసరంగా నేను రావటమెందుకు? మీరే వెళ్ళి తెస్తే సరిపోతుంది కదాని" తడబడుతూ అంది.

ఎందుకోగానీ, ఎలాగయినా తనని నావెంట తీసికెళ్ళాలని పట్టుదలగా వుంది.

"పోనీ నేను ఎందుకు వెళ్ళటం అనవసరంగా. నువ్వే వెళ్ళి తేరాదూ అందరికీ బట్టలు."

'అనవసరంగా' అని ఆమెని వెక్కిరిస్తున్నట్లు అన్నాను. జవాబు రాలేదు.

"ఒకేమాట చెబుతున్నాను. నువ్వొస్తేనే వెళ్ళేది. లేకుంటే నేనూ వెళ్ళేదిలేదు; ఎవళ్ళకీ బట్టలు తెచ్చేదీ లేదు. సరేనా?" ఈ సారి మరింత సీరియస్‌గా అన్నాను.

"అబ్బెబ్బే! అలా చెయ్యొద్దు....పోనీ....నేనూ వస్తాలెండి" అంటూ లేచి నిలుచుంది.

నేను సంతృప్తిగా ఇవతలికొచ్చి అమ్మ ఇచ్చిన కాఫీ అందుకున్నాను. ఇద్దరం కలిసి కార్లో బయలుదేరాము, బజారుకి. మా ఇల్లు స్టేషన్‌కి దగ్గరే అయినా, వూరికి కాస్త దూరమే వుంది. అందుకే సరదాకోసం కొన్నదయినా కారు ఇప్పుడు అవసరం కిందికి అయింది.

అందమయిన అమ్మాయి పక్కనుంటే కారు డ్రయివ్ చేస్తూ అలా వెళ్ళటంలో అంత ఆనందం వుంటుందని నేనెప్పుడూ అనుకోలేదు. ఎప్పుడో ప్రేమా, పెళ్ళి అంటే ఎలాంటి నిశ్చితాభిప్రాయాలూ లేని వయసులో ప్రేమించటం, భంగపడటమూ జరిగి పోయాయి. దాంతో స్త్రీ సాంగత్యమూ, పెళ్ళీ అంటేనే బెదురు పట్టుకున్నది నాకు. ఒక అమ్మాయి మనపై చూపించే ప్రేమ నిజమయిందో కాదో ఎలా తెలుసుకోవాలో నాకింకా అర్థం కావటం లేదు.

అలాంటిదివాళ ఇలా ఇంత చనువుగా సంధ్యని పక్కన కూచోబెట్టుకుని కార్లో తీసికెళ్ళటమూ, ఆ వెళ్ళటంలో ఏదో తెలియని

గర్వాన్నీ, సంతోషాన్నీ అనుభవించటమూ, నాకే కలలా వింతగా అనిపిస్తూంది

ముభావంగా కూచుని వళ్ళో పెట్టుకున్న చేతుల వయిపు చూసుకుంటున్న సంధ్యవయిపోసారి చూశాను. ఆడవారి చేతులని గూర్చి కవులు చేసే వర్ణనల్ని అతిశయోక్తులు అనుకునేవాణ్ణి. ఇప్పటికిప్పుడు, నాజూకయిన ఈమె చేతుల్ని చూస్తుంటే నా పొరబాటు తెలిసి వచ్చినట్లుంది. ఒక్కసారి ఆ చేతుల్నలాగే ముద్దు పెట్టుకుందామా అనిపించింది. ఆ ఆలోచన రాగానే స్టీరింగ్ పట్టు తప్పిపోయింది.

ఉలిక్కిపడి నన్ను నేను సంబాళించుకున్నాను. సంధ్యతో వచ్చిన చిక్కే ఇది. మాటలు రాని దానిలా అలా ఎంతసేపయినా మూగగా ఉండిపోగలదు. అయితే మాట్లాడిస్తే మాత్రం మామూలుగానే మాట్లాడుతుంది.

ఇక మాట్లాడకపోతే, నా ఆలోచనలు దారి తప్పేట్లున్నాయని గ్రహించి మొదలుపెట్టాను.

"సంధ్యా! ఏవిటలా ముభావంగా ఉన్నావ్? బలవంతంగా తీసుకొచ్చానని కోపమా?"

"ఛ! మీ మీద నాకెందుకూ కోపం? అదేంలేదు" నా మనసు చివుక్కుమంది. అవును నాకూ, ఆమెకీ ఏం సంబంధం వుందనీ, ఆమె నాపై అభిమానంగానీ, కోపంగానీ చూపటానికి అనుకున్నాను.

"పోనీలేగానీ, ఇవాళ నీకో ఫోటో తీయించాలనుకుంటున్నాను. తీరా స్టుడియో కెళ్ళాక, ఇంటి దగ్గరలా మొండి చేస్తావేమోనని ఇప్పుడే చెబుతున్నా" నవ్వుతూ అన్నాను.

"ఫోటోనా? నాకా? ఎందుకూ?"

"అంత ఆశ్చర్యం ఎందుకూ? ఏం నువ్వు ఫోటో తీసుకోగూడదా? ........ఇన్నాళ్ళూ నస పెట్టావుగా నన్ను మీవాళ్ళ దగ్గిరికి పంపించెయ్యండోచ్ అని. ఇంకా ఆలస్యం అవుతే, వాళ్ళెవరో నిన్ను వెతుక్కుంటూ వచ్చారంటే, నిన్ను మా ఇంట్లో దాచుకున్నామని నామీద కేసు పెట్టగలరు....నీ ఫోటో తీయించి పేపర్లో

వేయిద్దామనుకున్నాను సంధ్యా!"

"అంటే....అంటే....ఆ ఫోటో చూపి మా అమ్మా, నాన్నా ఎవరో నన్ను వెతుక్కుంటూ ఇక్కడికొస్తారన్నమాట."

"అవును ఏం? ఇన్నాళ్ళూ వెళతానన్న దానివి ఇవాళ అంత ఆదుర్దా పడుతున్నావేం?"

"అహఁ! అది కాదు. నా రాతకి నాకే ఆశ్చర్యంగా వుంది. నాదెంత చిత్రమయిన బ్రతుకు చూశారా? నేనూ మనిషినే. నావెనక ఏ ఇరవయి, ఇరవయి రెండేళ్ళ జీవితమో వుంది. కానీ దాన్ని గురించి అవగింజంతయినా నాకు తెలీదు. నాకు జన్మనిచ్చిన తల్లి దండ్రు లెక్కడో వుండే వుంటారు. కానీ వాళ్ళెవరో నాకు తెలీదు.

"ఆఖరుకివాళా, రేపూ వాళ్ళు నాకోసం వచ్చినా నేను గుర్తు పట్టగలనో లేదో నాకే తెలీదు. గుర్తు పట్టలేక పోవటమే జరిగితే, అపరిచితుల వెంట వెళ్ళినట్లే అవుతుంది. చివరికిలాంటి బ్రతుక్కి గమ్యం ఎలా వుంటుందో? ఇంకా ఎంత మందికి ఎన్ని బాధలు కలిగిస్తానో........"

మాట్లాడనిస్తే ఇంకా ఎంత నిరాశగా మాట్లాడి వుండేదో గానీ, నేనే వినలేక, విని భరించలేక ఆపేశాను.

"ఛ! ఎందుకంత పెసిమిస్టిక్‌గా మాట్లాడతావు? నీ బ్రతుక్కేమీకాదు. చిన్న ఆక్సిడెంట్ వల్ల కాస్త మతిమరుపు వచ్చినంత మాత్రాన జీవితమే వ్యర్ధమనుకోవాలా? చూస్తూండు. నీ ఫోటో వేశాక వారంతిరిగేలోగా మీ అమ్మా నాన్నా వస్తారు. తప్పక నువ్వు గుర్తు పడతావు. సరేనా? అప్పుడిక నేనూ, అమ్మా గుర్తుంటామా నీకు? మీవాళ్ళని చూపిన క్షణంలో మమ్మల్ని మరిచి పోయి పరిగెత్తి వెళ్ళిపోవూ?" సరదాగా, ఆమె మూడ్‌ని మార్చటా నికి ప్రయత్నిస్తూ అన్నాను.

"ఛ! ఎంత మాటన్నారు? మిమ్మల్ని ఎప్పటికయినా మరిచి పోగలనా? మీరే నన్నిలా ఆదుకొని రక్షించకపోతే నా బ్రతు కేమయేదో?...."

మాటల్లో ఉండగానే టవునులోని ఒక బిజీసెంటర్లోకి చేరు

కున్నాము. ఒక స్టుడియో ముందు కారాపేను.

స్టుడియో లోపల అడుగు పెట్టగానే, ఫోటోగ్రాఫరు కూచో బెట్టి మర్యాదచేసి, "ఏసైజు తీయాలిసార్, కలర్‌ఫోటో తీసేదా?" అంటూ నాలుగయిదు సైజుల్లో జంటలున్న చక్కని ఫోటోలు మా ముందు పడేశాడు. నేను సాభిప్రాయంగా సంధ్య వయిపు చూశాను. సిగ్గుతో తలవంచుకుని వుంది.

తమాషాకిది సమయం కాదనుకుని, "ఇద్దరికీ అక్కర లేదోయ్. ఆవిడొక్కరికీ బస్ట్ ఫోటో తీయాలి. పాస్‌పోర్టుసైజు చాలు, కలరదీ ఏం వద్దుగానీ, కాస్త సుకుమా. ముఖం గుర్తు పట్టేలా తియ్యి చాలు" అన్నాను.

"అహ్హహ్హ! అదేవిటా్సర్ అలాగంటారు. చూస్తారుగా మీరే ఎలా తీస్తానో, నే తీసిన ఫుటో ఎలా వుంటుందో. మళ్ళీ మీరే వస్తారు జంటగా తీయించుకుంటామని" అంటూ, తన జోక్‌కి తనే నవ్వేస్తూ కెమెరా అదీ సర్దుకోసాగేడు.

ఫోటో తియ్యటం అయాక, సరాసరి ఓ పెద్ద బట్టల దుకాణాని కెళ్ళేము.

బట్టల దుకాణంలో మేమిద్దరం ఎక్కువగా మాట్లాడుకో లేదు. సెలక్షన్‌లో సంధ్య నాకు పెద్దగా సహాయం చేసిందీ లేదు. ఏదడిగినా మీ ఇష్టమనో, బావుంది అనో వూరుకునేది. చేసేదేమీలేక నాకు తోచినవేవో, నాకో రెండుజతలూ, అమ్మకో నాలుగు చీరలూ, తనకో నాలుగూ, మేచ్ అయే జాకెట్ పీసులూ తీసుకుని బయట పడ్డాము.

ఇల్లు చేరుకునేసరికి ఇంట్లోంచి అమ్మతో ఎవరో మాట్లాడు తున్నట్లు విన్పించింది. గేట్ తీయటానికి వచ్చిన రంగయ్య నడిగాను చుట్టాలెవరయినా వచ్చారా అని.

ముసిముసిగా నవ్వుతూ, "నాగరాజు బాబొచ్చారండయ్య గారూ!" అన్నాడు వాడు. వాడి సంతోషానిక్కారణం లేక పోలేదు. మా నాగరాజు ఎప్పుడొచ్చినా ఇంట్లో వున్న పని వాళ్ళందరికీ మంచి బక్షీస్‌లు ముట్టుతాయి. అదీ సంగతి.

ఈ నాగరాజెవర్నట్లు ప్రశ్నార్థకంగా చూపింది సంధ్య కారును గేరేజ్‌లో పెట్టి దిగి వచ్చిన నావయిపు.

"నాగరాజంటే మాకజిన్ బ్రదర్ సంధ్యా. చాలా సరదా మనిషి. పద చూద్దువుగానీ....రంగయ్యా! కార్లో వున్న పేకెట్లు పట్టుకొచ్చి గేరేజ్ తాళం పెట్టు." అని పురమాయించి, సంధ్యతో ఇంట్లోకి నడిచేను.

గుమ్మం దగ్గిర్నించే, "హలో నాగరాజూ! ఎప్పుడూ రావటం? ఇన్నాళ్ళకీలా మళ్ళిందేం గాలి?" అన్నాను.

అమ్మతో ఏదో పడవడా వాగుతున్న వాడు ఇటు తిరిగి చూపి ఆశ్చర్యంగా, "మార్వెలస్? ఎలాగయితేం ఇన్నాళ్ళకి భలే చక్కని వదిన్నే సంపాదించావ్!....ఏంవిటీ అన్యాయం పెద్దమ్మా, మాకెవళ్ళకీ తెలీకుండా గుట్టుచప్పుడు కాకుండా అన్నయ్యకి పెళ్ళెప్పుడు చేశావ్?"

వీడితో వచ్చిన చిక్కే ఇది. ఇవతలికి వాళ్ళకి జవాబిచ్చే అవకాశం కూడా లేకుండా, ఫుల్‌స్టాప్ పెట్టకుండా వాగుతాడు వెధవ.

"చాల్లేరా నోరుముయ్యి! నీకు తెలీకుండా అన్నయ్యకి పెళ్ళెలా అవుతుందనుకున్నావ్? అవన్నీ తరవాత చెబుతాగానీ ముందు లేచి కాళ్ళు కడుక్కో భోజనం చేద్దువుగానీ" అని అమ్మ వాడి నోరు మూయించి లోపలికి లాక్కుపోయింది.

అమ్మయ్య అని తేలిగ్గా ఊపిరి పీల్చుకుని వెళ్ళ నాగరాజు ఖాళీచేసిన సోఫాలో కూలబడ్డాను. అప్పటికే సంధ్య తన గదిలోకి వెళ్ళిపోయి తలుపేసుకు నుంది.

* * *

ఆవాళ ఆఫీసుకి వెళుతూ, దారేకనుక స్టూడియోకి వెళ్ళి సంధ్య ఫోటో కాపీలు తీసుకున్నాను. ఫోటో చాలా బాగా వచ్చింది.

ఫోటోతోపాటి ఇలారాసి పంపించాను, పేపర్లో వేయటానికి. "దాదాపు ఇరవయిమూడేళ్ళ వయసుగల పై ఫోటోలోని అమ్మాయి తాలూకు వారెవరయినా వున్నచో, ఈ క్రింది అడ్రసుకి వచ్చిన ఎడల ఆమెను కలుసుకొనవచ్చు—" అని చివరగా నా చిరునామా

ఇచ్చాను. అంతకంటె ఏం రాయాలో అర్థం కాలేదు. అయినా అసలు వ్యక్తులెవరో దీన్నిచూస్తే అర్థం అయేలా రాశాను. చాలులే అని నాలోనేనే సంతృప్తి చెందాను.

ఫోటోను తనకి చూపించాలని, ప్రకటన పంపించిన విషయం చెప్పాలని ఉత్సాహంగా ఇంటికి చేరాను ఆ సాయంకాలం.

అమ్మ ఎవరో టవున్లో తెలిసినవాళ్ళ ఇంటికి వెళ్ళిందని రంగయ్య గేటుదగ్గరే చెప్పాడు. కారుని త్వరగా గేరేజ్‌లో వుంచి, ఇంట్లోకి అడుగు పెట్టాను.

గబగబా సంధ్య దగ్గరికి వెళ్ళబోయిన నేను, లోపల్నుంచి మాటలు విన్పించి గుమ్మం దగ్గరే ఆగిపోయాను. మాటల్లో నాగరాజు స్వరం విని ఆశ్చర్యం వేసింది. వాడు వచ్చి మూడు రోజులయినా సంధ్య వాడితో అతగా మాట్లాడినట్లు నేను చూడలేదు. అందు కవకాశం యివ్వకుండా తప్పుకుంటుందని కూడా ఒకటి రెండుసార్లు నాకనిపించక పోలేదు. అలాంటిదివాళ తన గదిలోచేరి కబుర్లు చెబుతున్నాడే ఇంత స్నేహితులెప్పు డయ్యారబ్బా అనుకున్నాను.

అంతలో నాగరాజు మాటలు గట్టిగా విన్పించాయి. "నంగ నాచిలా పోజు పెట్టకు సంధ్యాదేవీ! వచ్చినప్పట్నుంచీ చూస్తున్నాను. నన్నుచూస్తే పురుగును చూసినట్లు తప్పుకుంటావేం? మా అన్నయ్య గారికంటే తీసిపోయానేం నేను! కన్నెత్తి చూడటానిక్కూడా తగనా?"

"మధ్యని ఆయన్తో ఎందుకు పోల్చుకుంటారు? నేను మాట్లాడితే ఎంత మాట్లాడకపోతే ఎంత? దాన్తో మీకు ఒరిగేదేముంది?"

"హుఁ! ఈ నాగరాజు కోరితే కోటిమంది కాళ్ళమీద పడతారు. కోరుకున్న దానితో అవమానం పొందటమనేది వీడి జీవితంలోనే లేదు. అలాంటిదివాళ నువ్వు నన్ను కించపరచగల ననుకుంటున్నావేమో, అది జరిగే పనికాదు........"

"....................."

"ఎప్పుడూ ఎవర్నీ ఇలా అడుక్కోలేదు. నీ ముఖంలో ఏం

మాయవుందోగానీ ఒకేమాట చెబుతున్నాను. నామాట విను. నన్ను పెళ్ళి చేసుకోవటానికి వప్పుకో. మా అన్నయ్యకున్నంత రెండింతలు ఆస్తివుంది నాకు. కాలు నేలమీద ఆనకుండా చూసుకుంటాను నిన్ను నామాట విన్నావంటే."

సంధ్య నవ్వు వినిపించింది.

"ఎంతమంది అమ్మాయిలతో ఈ డైలాగులు చెప్పారిందాకా? నేనెన్నో దాన్ని?"

నాగరాజు బూటుకాలితో నేలమీద గట్టిగా తన్నినట్లయింది. "హుఁ! ఎంత పొగరు? నిన్నెలా లొంగదీసుకోవాలో తెలుసునాకు, నీలాంటి వాళ్ళని తొంభైమందిని చూశాను........"

"అదీ జన్మలో జరగదు. నా ఇష్టం లేకుండా నన్నెవరూ ఏమీ చేయలేరు."

"అహఁ! అలాగా! చూద్దాంగా అదీ. అయినా ఇంతదాకా ఏమో అనుకున్నాను గానీ, ఇప్పుడు తెలుస్తూంది నీ ట్రిక్. మా అన్నయ్యమీద వలపన్ని కూచున్నావేమో. అది నీవల్లగాని పని. వాడు ఘోటక బ్రహ్మచారి. పెళ్ళంటే భయం, ఆడదంటే బెదురు. నువ్వెన్నేళ్ళు కాచుకున్నా వాడు నిన్ను వరించేదీ లేదు. పెళ్ళాడేదీ లేదు.

"అయినా నువ్వేమిటో నీ బ్రతుకేమిటో తెలీకుండానే నేనయితే నిన్ను కోరుకుంటున్నాగానీ, నీకు వాణ్ణి దక్కనిచ్చేంత ఫూల్ కాదు మా పెద్దమ్మ. పనిమనిషిలా చాకిరీ చేస్తున్నావని అభిమానం వలక పోస్తూంది. అంతే.

"నిన్ను మీ వాళ్ళ దగ్గిరకి పంపిస్తారని ఆశ పెట్టుకూర్చున్నావేమో. అదీ జరిగేది కాదు. నువ్వీ ఇంట్లో జీతంలేని సర్వెంట్‌వి. తెలుసా?"

వాడి మాటలు వినలేకపోయాను. గబుక్కున లోపలికెళ్ళి వాడి చొక్కాపట్టి వీధిలోకి ఈడ్చేద్దామనిపించింది. కానీ ఇంకా ఏం చెబుతాడో, సంధ్య ఏం జవాబిస్తుందో వినాలనిపించి ఆగిపోయాను.

"మీ పెద్దమ్మ గురించీ, అన్నయ్య గురించీ మాట్లాడే అధికారం

కూడా మీకులేదు………… అసలు ఇంత మర్యాదనిచ్చి నీతో మాట్లాడటం కూడా అనవసరం! నువ్వు మీ అన్నయ్య కాలిగోటికి కూడా సమానం కాలేవు. వాళ్ళిద్దరూ నన్ను ఆదుకుని రక్షించిన దేవతలు. వాళ్ళకి ఈ జన్మంతా వూడిగంచేసినా ఋణం తీర్చుకోలేను. నీ మాటలు నమ్మి వాళ్ళనే ద్వేషించేంత మూర్ఖురాల్ని కాదు నేను.

"ఇంకా నీతో నాకు మాటలేంవిటి? పద బయటికి"

"హుం! నన్నా బయటికి పొమ్మంటావ్? ఎంత పొగరు?"

ఇంక వినలేక గబుక్కున లోపలికి నడిచి నాగరాజు జుట్టు పట్టుకుని రెండు చెంపలూ ఎడాపెడా వాయించాను. దెబ్బలు తిన్న సిగ్గయినాలేదు వెధవకి. "నువ్వెందుకురా మధ్య నన్ను కొడతావ్? ఓహో ఈ పతివ్రతా శిరోమణిని ప్రేమిస్తున్నావా? అలాంటి ప్రేమలకి లొంగేది కాదిది. వట్టి కొరకరాని కొయ్య."

"షటప్ రాస్కెల్! సత్యంటే ఏమనుకున్నావ్‌రా. నాకాబోయే భార్య. ఆవిడ్ని గౌరవించటం నేర్చుకుంటే ఇంట్లో వుండు. లేదా ఈ క్షణంలో బయటికి నడువ్." అని కాలర్ పట్టి బయటికి లాక్కొచ్చాను.

ఎప్పుడొచ్చిందో అమ్మ గుమ్మం దగ్గర నిలుచుని అంతా చూస్తూవుంది. అమ్మ ముఖం చూశాకగానీ నాకు అర్థంకాలేదు, ఆవేశంలో నేనెంత తొందరపాటుగా మాట్లాడేనో. అసలామాట నామనసులో ఎన్నాళ్ళనించీ దాగివున్నదో,ఇవాళెలా బయటికొచ్చిందో నాకే తెలియదు.

పొరపాటుగానీ, ఇంకేదయినా కాని అనాలిసింది అనేశాను. దానికి ముందుగా అమ్మ అనుమతి తీసుకోక పోవటమే పెద్దతప్పు. ఇప్పటికయినా, ఆమె మనసును నొప్పించకుండా వప్పించు కోవలసిన బాధ్యతనాదే.

తరువాతో అయిదు నిముషాల్లో పెట్టెబేడా సర్దుకుని బయలుదేరి వెళ్ళిపోయాడు నాగరాజు. వాడికి కనీసం అమ్మతో వెళ్ళొస్తానని చెప్పేందుకు కూడా ముఖం చెల్లలేదు.

మవునంగా నా గదిలోకి వెళ్ళి డ్రస్ మార్చుకుని ఆలోచిస్తూ

కూర్చున్నాను - అమ్మతో ఏమని మాట్లాడాలా అని. ఇంతలో ఆవిడే కాఫీకప్పు తీసుకుని నాదగ్గిర కొచ్చింది. దాంతో ఆవిడకి నా మీద కోపం ఏమీలేదని అర్థమయింది.

కప్పు అందుకుని, అమ్మ వంక క్షమార్పణగా చూస్తూ, "నన్ను క్షమించమ్మా. ముందుగా నీకు చెప్పకుండా తొందర పడ్డాను. వాడి ప్రవర్తనతో రెచ్చిపోయిన నాకు ఒళ్ళు తెలీలేదు. ఏం మాట్లాడుతున్నదీ ఆలోచించకుండా అనేశాను" అన్నాను.

"నా బాధ అదికాదు చక్రం. నా ఇష్టం లేకుండా నువ్వేమీ చెయ్యవని నాకు తెలుసు. సంధ్యంటే నాకెంత అభిమానమో నీకూ తెలుసు. ఇప్పటికే ఆ అమ్మాయి మనతో ఎంతోబాగా కలిసి పోయింది. అంత మర్యాదా, మన్ననాగల అమ్మాయి మనకింకెక్కడ దొరుకు తుంది. ఆ అమ్మాయిని చేసుకొమ్మని అడగాలని నాకే వుంది."

"కానీ త్వరలో వాళ్ళ తల్లితండ్రులెవరో వచ్చాక, వాళ్ళనీ, ఆ అమ్మాయినీ సంప్రదించి నిర్ణయం తీసుకునుంటే బావుండేది."

అమ్మమాటలు నిజమే ననిపించాయి. ముఖ్యంగా నేనింత వరకూ. సంధ్యకసలు ఇష్టముందో లేదో తెలుసుకోలేదు. నేనన్న మాటకి ఆమెలో రియాక్షన్ ఎలావున్నదీ కూడ గమనించలేదు. నాలో ఇంత స్వార్థం, అహంకారం దాగి వున్నాయని నాకే తెలీదు. ఇప్పటికయినా సంధ్య మనసులో ఏముందీ తెలుసుకోకుండా ఆమె ముఖం చూడలేనన్పించింది.

"అదికాదమ్మా. సంధ్యకిష్టమయితే, వాళ్ళవాళ్ళ నొప్పించటం అంత సమస్య కాదనుకుంటాను. ఇప్పుడు ఆమె ఏమనుకుంటున్నదీ తెలుసుకోవటం ముఖ్యం; నోరుజారి మాట అనేశాను కనుక........ ఏమంటావమ్మా?"

ఆ తెలుసుకోవటం, అమ్మే తెలుసుకుంటే బావుంటుందనే ధోరణిలో అన్నాను.

"అలాగే! సమయంచూపి నేకనుక్కుంటాను ఆ అమ్మాయి మనసు. ఇంతలోగా నువ్వు తనని మాట్లాడించకు. ఒకవేళ తన ం కాకపోతే అనవసరంగా ఇరుకున పెట్టినట్లవుతుంది."

జ్యోతి

"సరేనమ్మా నీ ఇష్టం" అన్నాను.

ఎప్పుడెప్పుడు అమ్మ అడుగుతుందా, సంధ్య ఏమని చెబుతుందా అని ఆత్రుతగా ఎదురుచూస్తూ గడిపాను సాయంత్ర మంతా.

చీకటిపడే ముందు మామూలుగాచేసే వంటపనికోసం వంట గదిలోకి వెళ్ళింది సంధ్య. మెల్లిగా వెళ్ళి తోటలో వంటగది కిటికీ దగ్గరగా కనిపించకుండా కుర్చీవేసుకుని పుస్తకమొకటి పట్టుకుని కూర్చున్నాను.

అమ్మ అడుగుతూంది.

"ఎందుకు సంధ్యా మొఖం అంత కందిపోయింది. ముఖం కడుక్కున్నావా?"

"కడుక్కున్నానమ్మా ...."

"మరే.........వాా చక్రం అంటే నీకిష్టమేనా తల్లీ? వాడు నీ మనసులో ఏముందీ తెలియకుండా నీ మనసు నొప్పించానేమోనని చాలా బాధ పడుతున్నాడు."

"..............."

"నీ ఇష్టమేమిటో బెరుకు లేకుండా చెప్పమ్మా. నువ్వెలా చెప్పినా మేమెవరూ ఏమీ అనుకోము సరేనా?"

"మీ మంచితనంతో నన్ను మరింత బాధ పెడుతున్నారమ్మా. మీరంతగా బ్రతిమాలుకోవాలసిన విషయమా? మీకోడలి నవటంకంటే మించిన అదృష్టం నాకింకే ముంటుంది? ఎటొచ్చీ మీ ఆస్తి అంతస్థులకీ, మంచితనమూ. సంస్కారాలకీ నేనే అర్హత లేనిదాన్నేమో అని నా అనుమానం. నేనెవర్నో, నా పుట్టు పూర్వోత్తరాలేవో నాకూ తెలీదు. మీకూ తెలీదు. అలాంటప్పుడు...."

"పిచ్చిపిల్లా! ఆ ఆలోచనలన్నీ నీకెందుకు? నీకిష్టమేనని చెప్పావు. అంతేచాలు. ఆస్తులూ, అంతస్థులతో మనిషినీ, మంచి తనాన్నీ కొనగలమా మేము. నువ్వీ ఇంట్లో అడుగు పెట్టినాటి నుంచీ, నీలాంటి కూతురుంటే ఎంత బాగుండేదా అనుకునేదాన్ని. నా ఇష్టాన్ని భగవంతు డీ రూపంలో తీర్చబోతున్నాడు.

"మా బాబు ఎన్నేళ్ళుగానో పెళ్ళివద్దని భీష్మించుకున్నాడు. ఈ ఇంటికిక వారసులే లేకపోతారేమో అనుకున్నాను. అలాంటి దిప్పుడు నీలో ఏమి చూశాడో నిన్ను చేసుకొంటా నంటున్నాడు.

"ఇవాళ నాకెంత ఆనందంగా వుందో చెప్పలేను. నా చేతుల్తో స్వయంగా స్వీట్ చేసి మీకిద్దరికీ పెడతాను....అన్నట్లు నీ ఫోటో పేపర్లో వేయించాడా బాబు? కనుక్కుంటాను. ఇంకో నెలరోజుల్లో ముహూర్తాలు పెట్టుకుందాము. మీ తల్లి దండ్రులతో సంప్రదించాక. ఏమంటావ్?"

తరవాత సంధ్య ఏమన్నదీ నాకు వినిపించలేదు.

* * *

ఆ దీపావళి ఎన్నడూ లేనంత ఉత్సాహంగా, సంతోషంగా జరుపుకున్నాము. నేను తెచ్చిన కొత్తచీర కట్టుకుని అమ్మవెంట హడావిడిగా తిరుగుతూ, ఇంటి చుట్టూతా దీపాలు వెలిగిస్తున్న సంధ్యని చూస్తూ కూచునివుంటే నన్ను నేనే మరిచిపోయాను.

హఠాత్తుగా, ఆవాళ ప్రత్యేకంగా సంధ్యకి ప్రెజంట్ చేయాలని తెచ్చిన వస్తువు గుర్తొచ్చింది. ఉదయంనించి పండుగ హడావిడిలో వున్న సంధ్యతో మాట్లాడేందుకు వీలే దొరకలేదు. ఇప్పుడయినా ఇవ్వకపోతే ఇక లాభం లేదనుకుని మెల్లిగా లోపలికి నడిచాను.

ఎదురొచ్చిన రంగయ్యతో, "అమ్మాయి గార్నోసారి ఇలా రమ్మనరా" అని చెప్పి నాగదిలో కెళ్ళాను. అల్మైరాలో దాచివుంచిన చిన్న ముత్యాల నెక్లేస్ వున్న బాక్స్ ఒకటి బయటికి తీశాను.

ఇంతలో రానేవచ్చింది సంధ్య. "ఏమిటో పిలిచారట" అంది గుమ్మందగ్గరే నిలుచుని.

"అబ్బ! కాస్త లోపలికి రావోయ్ నీ సొమ్మేం పోదుగానీ." నవ్వుతూ లోపలికొచ్చింది.

"ఈ దీపావళి రోజు నీకివ్వాలని మంచి ప్రెజంటేషన్ పట్టుకొస్తే, ఉదయంనించీ దొరక్కుండా తిరుగుతున్నావ్‌గా? ఇప్పటికయినా ఈ కానుకని స్వీకరిస్తే ధన్యుణ్ణి దేవీ!" అన్నాను నాటక

పక్కలో.

ఉత్సుకతతో బాక్స్ అందుకుని తెరిచి చూపింది. సంతోషంతో తన కళ్ళు మెరిసాయి.

"చాలా బావుంది. అయినా ఇప్పుడెందుకింత ఖరీదుపెట్టి తెచ్చారిది?"

"ఆడబుద్ధి పోనిచ్చుకున్నావ్ కాదు. నీకు నచ్చింది కదా? ఇప్పుడింక డబ్బు ప్రసక్తెందుకు? ఇలాంటి సమయాల్లో ఖర్చు చేయటానిక్కాకపోతే ఇక డబ్బు ఉండి మాత్రం ప్రయోజనమేవిటి.... వేసుకో చూద్దాం...." అన్నాను, నన్ను వేయమంటుందేమోనని ఆశపడుతూ.

ఉహుఁ! అదేమీ లేకుండా తనే వేసుకుంది ఒక్క క్షణంలో. చెయ్యిపట్టి లాక్కెళ్ళాను అద్దం దగ్గిరికి, ఎలావుందో చూసుకొమ్మని.

అద్దంలో చూసుకుని, చిరునవ్వుతో నా చేయి విడిపించుకుని, వెళ్ళబోయింది.

"కనీసం థాంక్స్ అయినా చెప్పేదిలేదా సంధ్యా!"

"నా థాంక్స్ కోసమే తెచ్చారా ఏం ఇంత మంచి బహుమతిని. థాంక్స్ చెబుతూవుంటే రోజు కెన్నోసార్లు మీకు చెబుతూ వుండాలనే అనిపిస్తుంది. అన్నీ కలిపి ఎప్పుడో ఒక్కసారి పెద్ద థాంక్స్ చెప్పేస్తాలెండి" గడుసుగా అంటూ వెళ్ళిపోయింది.

ఆమె మాటల వెనుకవున్న చిలిపితనాన్ని నెమరువేసుకుంటూ నేనూ బయటికి నడిచాను.

* * *

పేపర్లో ప్రకటన వేయించి నెలరోజులవ్వొస్తుంది. ఇంత దాకా ఎవరూ రాలేదు. ఎటువంటి ఉత్తరమూలేదు. ఆ విషయాన్ని గూర్చి నేనంత దిగులు పడలేదుగానీ, సంధ్య మాత్రం అప్పుడప్పుడూ ఆలోచిస్తున్నట్లుండేది.

అప్పుడప్పుడూ ఇద్దరం కలిసి షికారు కెళ్ళేవాళ్ళం. తెలిసినవాళ్ళంతా పెళ్ళెప్పుడని అడుగుతున్నారు. ఏమని చెప్పాలో తోచ

లేదు మాకు.

హఠాత్తుగా అమ్మ వూరెళ్ళాలిసి వచ్చింది. ఎవరో దూరపు బంధువు చనిపోవటంతో.

ఇల్లంతా సంధ్యకి అప్పగింతలుపెట్టి బయలుదేరింది అమ్మ. అమ్మ వెళ్తున్నందుకు ఒక రకంగా సంతోషించాను నేను. ఈ మధ్య సంధ్య కాస్త పరధ్యానంగా దిగులుగా కనిపిస్తూంది. ఈరకంగా అయినా తనతో ఒంటరిగా వుండే ఛాన్సెస్ ఎక్కువగా దొరికితే, కాస్త అనునయంగా మాట్లాడి ధైర్యం చెప్పవచ్చునని ఆశపడ్డాను.

అమ్మకూడా వెళ్ళేముందు నాతో మాట్లాడుతూ అదే భావాన్ని వెలువరించింది. "ఈ మధ్య సంధ్య కాస్త ఎలాగో వుంటుందిరా. అడిగితే ఏమీ చెప్పకుండా తప్పించుకుంటూంది. బహుశా తన ఫోటో పేపర్లో వేయించినా ఎవరూ రాలేదని బెంగ పెట్టుకుందేమో. కాస్త ధైర్యంచెప్పి జాగ్రత్తగా చూసుకో. ఒంటరిగా ఎక్కువ ఆలోచించి మరీ మనసు పాడు చేసుకుంటుందేమో."

"అలాగేనమ్మా. మూడు రోజులకల్లా తిరిగి వస్తావ్‌గా నువ్వు?" అంటూ సాగనంపాను అమ్మని.

రెండు రోజులు సరదాగా గడిచాయి. మొదటిరోజు అతి కష్టంమీద సంధ్యని సినిమాకి బయలుదేరదీశాను. ఏమంటే సినిమా లంటే తనకంత ఇంటరెస్ట్ లేదంటుంది. "సినిమా చూడటమె వసిక్కావాలి? ఆ మూడు గంటలూ, పక్కని కూచుని కబుర్లు చెప్పు కోవచ్చునిగానీ. ఉత్త మొద్దుపిల్ల" అనుకున్నాను.

ఎంతసేపూ నన్నే వసపోసిన పిట్టలా వాగిస్తుందేగానీ, తను మాత్రం ఎక్కువగా తన మనసు బయటపెట్టదు.

మా ఇంటి కొచ్చినప్పట్నించి తను నన్నుగురించి ఏమను కున్నదీ చెప్పించాలని ఎంతో ప్రయత్నించాను. ఉహూ! అలా బయట పడే ఘటం కాదు.

ఆ రెండు రోజులూ కలలా గడిచిపోయాయని ఎన్నో సార్లు అనుకున్నాను. కానీ మూడవరోజు రాత్రికి అవి నిజంగానే కలగానే మిగిలిపోయాయి.

జ్యోతి

తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడు. మూడవరోజ ఉదయం మా యింటికి ఒక అతిథి రావటం. సాయంత్రానికల్లా ప్రయాణం అయి సంధ్యని తీసుకెళ్ళి పోవటం కలలా జరిగిపోతూ వుంటే చూస్తూ వుండిపోయాను. అంతకన్నా నేను చేయగలిగింది మాత్రమేముంది కనక.

ఒకసారి జీవితంలో ఒకమ్మాయి చేత మోసగింపబడి ఓడి పోయాననుకున్నాను. మళ్ళీ కొత్త జీవితాన్ని చవిచూడటానికి ప్రయత్నించిన నాకు పెద్ద అడ్డురాయి తగిలింది. పూర్తిగా బోర్లా పడ్డాను. ఈ సారి దేవుడే నన్ను మోసగించాడు. కానీ మానవ మాత్రులు కాదు. చిత్తుగా ఓడిపోయాను.

మరు రోజుదయం వచ్చింది అమ్మ వూరినుంచీ. మొట్టమొదట ఆమె అడిగిన ప్రశ్న. "సంధ్యేది?" అని.

ఆమెని చూడగానే, "నీ కొడుకంత దరిద్రుడింకెవరూ వుండ రమ్మా. వాడికీ జన్మలో తను సుఖపడటం గానీ, నిన్ను సంతోష పెట్టటం గానీ చేయగల రాత రాసి లేదు. సంధ్య ఇక్కడ్నించీ శాశ్వతంగా వెళ్ళిపోయిందమ్మా! ఇంకెప్పుడూ రాదు" అనాలనుకున్నాను. గట్టిగా ఏడవాలనుకున్నాను.

కానీ ఏదీ చేయలేక శూన్యంలోకి చూస్తూ వుండిపోయాను.

* * *

## విశ్వామిత్ర:

హాస్పిటల్లో అడ్మిట్ అయి రెండు నెలలే అయినా ఏ రెండేళ్ళో అయినట్లుంది. జీవితంలో యింకెప్పుడూ ప్రాణం పోయే పరిస్థితి వచ్చినా హాస్పిటల్ మొహం చూడకూడదనిపించేంతగా విసిగిపోయాను. రకరకాల రోగాలతో బాధపడే రోగులనీ. రోజూ రొటీన్‌లో పని చేసుకుపోయే నర్సులనూ. ప్రతీ వుదయం ఆర్టిఫీషియల్ చిరునవ్వులు చిందిస్తూ అందర్నీ పలకరించే డాక్టర్లనీ చూసి చూసి మొహం మొత్తిపోయింది. అందుకే ఇవాళ డిస్‌ఛార్జ్ చేస్తారంటే నాకెంతో ఆనందంగా వుంది.

ఈ బోర్‌కి తోడు, గడిచిన రెండు నెలల్లో ఒక్కసారయినా బాబునిగానీ, జయనిగానీ చూడకపోవటంతో మరీ విసుగ్గావుంది. నాన్నగారు మాత్రం రోజూ వస్తారు. "జయకెలా వుంది?" అని అడిగితే "ఫరవాలేదు. కోలుకుంటూంది" అంటారు. ఒకసారి తీసుకు రమ్మంటే మాత్రం, "అహఁ! డాక్టరు ఆమెను పూర్తిగా రెస్ట్ తీసుకోమన్నారు బాబూ!" అంటారు.

కనీసం బాబునయినా ఒకసారి తీసుకురమ్మంటే, "వూఁ" అంటారే గానీ, రోజూ ఏదో ఒక సాకు చెప్పి తప్పించుకుంటారు. ఆయనెందుకిలా చేస్తున్నారో నాకర్థం కావటంలేదు. అసలు నిజంగా జయ ఆరోగ్యం ఎలావుందో, మంచంమీద వున్న వాళ్ళమ్మని చూసి కనీసం నేనయినా దగ్గర్లేనందుకు బాబెంత బెంగ పెట్టుకున్నాడో?— అని దిగులేస్తుంది. అన్నీ వివరంగా మాట్లాడదామంటే, నాన్నగారే పదినిముషాలో ముభావంగా గడిపేసి వెళ్ళిపోతారు.

మా పెళ్ళయి అయిదేళ్ళయింది. పెళ్ళయాకా, అవక ముందూ నా 'రాజ్‌దూత్' మీద ఎన్నోసార్లు నేనూ, జయ కలిపి తిరిగేము కానీ, ఆక్సిడెంట్ అవటం మాత్రం యిదే మొదటిసారి.

ఆ రోజు నాకింకా బాగా గుర్తే. ఆ వాళ మా పెళ్ళిరోజు. వారం రోజుల నించీ పోరి ఆఫీసుకి సెలవు పెట్టించింది జయ నన్ను.

వూరికి పదిమైళ్ళదూరంలో మాకో మామిడి తోటవుంది. ఆ రోజంతా అక్కడ గడిపి రావాలని ప్రోగ్రాం వేసుకున్నాము. మొదట బాబుతోకూడా కలిపి వెళ్ళాలనే అనుకున్నాము. మేమిద్దరమే సరదాగా గడిపి రావాలని నాన్నగారేమి ట్రిక్ చేశారో తెలీదు. తీరా బయలు దేరే టయానికి నేను రానని మొరాయించుకుని కూచున్నాడు.

"తాతయ్యతో నేను సర్కస్‌కెళ్ళాలి. మీతోటి నేరాను పొండి" అన్నాడు. "అరే. సర్కస్ టయిముకి వచ్చేద్దాంరా" అన్నా వినలేదు.

"ఆఁ! మీరు తోట కెళ్ళారంటే సాయంత్రం అయేదాకా రారు. ఈలోగా సర్కస్ మొదలెడతారు."

జ్యోతి

నాన్నగారూ అలాగే అన్నారు. "పోనీ విశ్వం. వాడు రానం టూంటే బలవంతం ఎందుకు? మీరే వెళ్ళిరండి. దాబాబూ మనం కథ చెప్పుకుందాం" అంటూ వాడి చేయి పట్టి లోపలికి తీసికెళ్ళారు. నాకు చాలా ఆశ్చర్యం వేసింది—నాన్నగారేం మంత్రం వేశారా అని. ఎందుకంటే మమ్మల్నిద్దర్నీ వంటరిగా వదిలి వాడు మామూలుగా వెళ్ళడు. వాడికి తెలీకుండా నేనెక్కడ వాళ్ళమ్మను కాకాపట్టి ఫేవర్స్ పొందుతానో అని వాడి భయం.

ఇంతలో బుట్టలో కావలసిన వస్తువులన్నీ సర్దుకుని వచ్చింది జయ. "బాబేడీ!" అంది.

"వాడు రాడట. హాయిగా వెళదాం రావోయ్" అన్నా రహస్యంగా. "అదేం" అంటే, "అది అంతే నాకు మాత్రమేం తెలుసు. నాన్నగారేంమంత్రం వేశారో?" అన్నాను.

అప్పటికి మాత్రం వాడు రాకపోతే, మేమిద్దరం హాయిగా గడప వచ్చనే అనుకున్నాగానీ, నిజంగా ఆ వేళ బాబు మాతో రాక పోవటం ఎంత మంచిదయిందా-అని యిప్పుడనిపిస్తుంది. మేమిద్దరం గురి అయిన ఆక్సిడెంటులో బాబే వుంటే, ఈ పాటికి మాకు బాబు ఉండేవాడు కాదు. భగవంతుడీరకంగా మాకు మేలు చేశాడని అప్పట్నించీ యిప్పటికి ఎన్నిసార్లు అనుకున్నానో!

మామిడితోటకి వెళ్ళటం మాకిది మొదటిసారి కాదు. మా ప్రేమాయణానికీ, పెళ్ళికీ నాంది అయిన ఎన్నో అనుభవాల్లో వుంది ఆ తోట. అందుకే అక్కడికెళ్ళాలన్నా, అక్కడున్న గెస్ట్ హవుస్‌లో గడపాలన్నా మాకిద్దరికీ చాలా యిష్టం.

మామూలుగా అవుతే రోజులో ఎక్కువ భాగం బాబుకి తల్లిపాత్ర వహించటమే సరిపోతుంది జయకి. కానీ సంవత్సరాని కో రోజు వచ్చే పెళ్ళిరోజుని మాత్రం, పెళ్ళికూతురయిపోతుంది. మరీ వెంట బాబు కూడా లేకపోవటం వల్లనేమో, ఈ మధ్యలో ఎన్నడూ లేనంత రొమాంటిక్‌గా కన్పించిందావేళ తను.

తీయగా కూస్తున్న కోయిలల, శబ్దాలలో, మంచి వాస నేస్తున్న మామిడి పూతతో నిండిన చెట్లమధ్య చిన్నపిల్లల్లా గ

మమూ రోజు. సాయంత్రమయినప్పట్నించీ జయ వెళదామనే అంటున్నా. చంద్రోదయాన్ని చూడాలని నేనే ఆలస్యం చేశాను. నిజానికారాత్రి అక్కడే గడపాలనుంది నాకు. కానీ జయ పూరుకోదని అడగలేదు. చీకటి పడుతుండగా బయలుదేరాము.

బైక్ రైడింగ్ మొదటి నించీ నా హాబీ అయినా, రాష్ డ్రైవర్ని మాత్రం ఎప్పుడూ కాను నేను.

నింపాదిగా బైక్‌ను నడుపుతూ జయతో కబుర్లు చెబుతున్నాను. మొదటినించీ బైక్ మీద వెళుతూ కబుర్లు చెప్పుకోవటమంటే భలే భయం తనకి. గట్టిగా పట్టుకుని, నర్వస్‌గా కూచుని నా మాటలు వింటూ వుంటుంది.

టవున్‌కి ఒక రెండు మైళ్ళదూరంలో వుండగా లారీ ఒకటి ఎదురుగుండా వస్తూ కన్పించింది. లారీ డ్రైవర్ బాగా తాగివున్నాడని అంత దూరం నించే దాని మూవ్‌మెంట్ చెబుతోంది. అప్పుడే కాస్త నా మనసు చలించింది, ఎందుకో తెలీదు.

లారీకి కాస్త దగ్గరవుతుండగా? "ఏమండీ! బైక్‌ని పక్కకి తిప్పండి. ఆ లారీ మన మీదికే వస్తోంది" అన్నాం భయంగా. ఆ మాటలతో నేను మరింత కంగారు పడ్డాను.

బైక్‌ని పక్కకి తిప్పి, చీకట్లో ఓ చెట్టుకి గుద్దేయటం, లారీ మా పక్కనించీ దూసుకుపోవడం, అంతా క్షణాల్లో జరిగిపోయింది. తరవాతేమయిందీ నాకు తెలీదు. మళ్ళీ రెండు రోజులకే హాస్పిటల్లో కళ్ళు తెరవటం, తలకి, కాలికీ పెద్ద దెబ్బలు తగిలాయని, కనీసం నెల రోజులయినా యిక్కడే వుండాలనీ తెలుసుకున్నాను.

జయకెలా వుందని అడిగాను నాన్నగార్ని. తలకి బలమయిన గాయం తగిలిందనీ, యింకా పూర్తిగా స్పృహ రాలేదనీ అన్నారాయన. ఆ రోజునించీ, ఈ వాళ్టిదాకా నేను జయను చూసింది లేదు. ఒకసారేమో డిశ్‌ఛార్జ్ అయి యింటికి తీసికెళ్ళామని చెప్పాడు నాన్న. నెలరోజులు కాస్తా రెండు నెలలకి పొడిగించారు. ఇవాళ యింటికెళ్ళొచ్చని, సూపర్నెంటుగారు నిన్నే చెప్పారు. నాన్న టాక్సీ తీసుకుని వస్తానని చెప్పి వెళ్ళారు.

జ్యోతి

ఎంతకీ అయిదు గంటలు కాదేమిటా. నాన్నగారు రారేమిటా అని ఎదురు చూస్తున్నాన్నేను. ఇంతలో రానే వచ్చారు. చిత్ర మేమిటో ఆవేళ నేనింటికొస్తున్నందుకు ఉండవలసినంత సంతోషం కన్పించలేదు నాకాయన ముఖంలో.

* * *

టాక్సీలో నాన్న నాతో ఎక్కువగా మాట్లాడలేదు. నా మన సెందుకో కీడును శంకించింది. "భగవాన్! బాబునీ, జయనీ క్షేమంగా కళ్ళతో చూడగలిగితే చాలు" అనుకున్నాను.

పని కుర్రాడు గోపీ గేటు తెరిచాడు. ఎప్పుడూ నవ్వుతూ చలాకీగా వుండే వాడి ముఖం కూడా వాడిపోయుంది.

మెట్లెక్కుతుండగా బాబు ఎదురొచ్చాడు. "డాడీ! నువ్వొక్క డివే వచ్చావేం? మమ్మీ ఏదీ?" అన్నాడు.

నా గుండెల్లో రాయి పడింది. అయితే జయ ఇంట్లో కూడా లేదన్నమాట. ప్రశ్నార్థకంగా నాన్న వయిపు చూశాను. ఆయన నా ముఖంలోకి చూడలేనట్లు తలవంచుకుని, బాబుతో "వస్తుంది బాబూ! మరి నాన్నకి వళ్ళు బాగులేదుగా? అలా విసిగించొచ్చా?.... నువ్వెళ్ళి రెస్ట్ తీసుకో విశ్వం! రాత్రి అన్ని విషయాలూ చెబు తాను" అంటూ బాబుని తీసుకుని తనగదిలో కెళ్ళిపోయారు.

గోపీ ఇచ్చిన కాఫీ తాగి, ఆలోచిస్తూ ఒక పేకెట్టు సిగిరెట్లు తగిలేస్తేగానీ రాత్రి అవలేదు. ఎక్కువ మాటలు లేకుండానే భోజ నాలు జరిగిపోయాయి. భోంచేసేటప్పుడు, బాబు "డాడీ! మమ్మీని ఇంకో పెద్ద హాస్పిటల్‌కి తీసికెళ్ళారటగా? నన్నోసారి అక్కడికి తీసికెళ్ళవూ?" అని అడిగాడు. "అలాగే బాబూ?" అన్నాను పరధ్యానంగా.

బాబుని నిద్రపుచ్చేసి నా గదిలో కొచ్చారు నాన్న. మంచం మీద నా పక్కనే కూచుని మొదలు పెట్టారు. "బాబూ విశ్వం! నా నోటతో నేనిలాంటి విషయం నీకు చెప్పాల్సి వస్తుందని నే ననుకోలేదు.

"ఆవాళ మీకు జరిగిన ఆక్సిడెంటులో జయ తలకి చాలా





పెద్ద దెబ్బ తగిలింది. నాలుగు రోజులకి పూర్తిగా స్పృహ వచ్చింది. కానీ ఆమె నన్నుగానీ, బాబునిగానీ గుర్తుపట్టలేక పోయింది. తలకి అయిన గాయంవల్ల ఆమె మెదడుకు దెబ్బ తగిలిందనీ, అందుకే ఇలా అయిందనీ అన్నారు డాక్టర్లు. ఆ రోజే ఇంటికి తీసుకొచ్చాను.

"తన నెక్కువగా మాట్లాడించవద్దనీ, బాగా రెస్ట్ తీసుకోవాలనీ చెప్పారు డాక్టర్స్. రోజూ డా॥ సుబ్రమణ్యంగారు వచ్చి చూసి పోతుండేవారు. తనకి మానసికంగా స్ట్రెయిన్ ఇవ్వరాదని నేనెంత ప్రయత్నంచేసినా, బాబుని మాత్రం పట్టలేకపోయాను. ఎప్పుడో నాకు తెలీకుండా, "మమ్మీ! మమ్మీ!" అని ఏడుస్తూ వెళ్ళిపోయేవాడు.

"జయ మామూలుగా కళ్ళుతెరిచి చూసేదిగానీ ఆ చూపులు మాత్రం శూన్యంగా వుండేవి. మీరెవరో నాకు తెలీదన్నట్లు వింతగా, కొత్తవాళ్ళని చూస్తున్నట్లు చూసేది. డాక్టర్‌గారేమో నిదానంగా కోలుకుంటుంది లెమ్మన్నారు.

"ఒకరోజు రాత్రి బాబు ఏడుపు వినిపించి ఉలిక్కిపడి లేచాను. పక్కన చూసుకుంటే లేడు, బయటెక్కడ్నించో వినిపిస్తోంది ఏడుపు.

"గబగబా వచ్చి ఈ గదిలో చూశాను. మంచంమీద జయ లేదు. దానిమీదే కూచుని, "మమ్మీ!" అని ఏడుస్తున్నాడు బాబు.

"బాబుని ఎత్తుకుని, "అసలేం జరిగింది. నాన్నా? నువ్విక్కడి కెప్పుడొచ్చావ్?" అని బుజ్జగించాను. "మరే, నువ్వు నిద్ర పోయాక వచ్చి మమ్మీ దగ్గర కరుచుకుని పడుకుని నిద్దరపోయాను. ఇప్పుడు లేచి చూస్తే లేదు మమ్మీ. ఎక్కడికో వెళ్ళిపోయింది తాతయ్యా?" అన్నాడు మళ్ళీ ఏడుపు మొదలుపెట్టి.

"గోపీని లేపి ఇల్లూ, తోటా అంతా వెతికాం యిద్దరం కలిపి. ఎక్కడా కన్పించలేదు అమ్మాయి. ఏం చేయాలో తోచలేదు. ఒక వయిపు బాబు ఏడుపుతో, ఆ రాత్రి ఎక్కడ కెళ్ళిందని వెతకాలో తెలియక సతమత మయిపోయాను. తెల్లవార్లూ ఆలోచిస్తూ గడిపాను.

"తెల్లవారగానే వినవలసొచ్చింది దుర్వార్త...."

ఇంక మాట్లాడలేనట్లు ఆగిపోయి తలవంచుకున్నారాయన. కళ్ళనిండా నీళ్ళు దుమకడానికి సిద్ధంగా వున్నయ్.

"చెప్పండి నాన్నగారూ! ఏం జరిగింది? నా జయకేమయింది?" అన్నాను అతృతగా.

"జయ మనకిక లేదు బాబూ. తెల్లవారగానే కొత్తగా పెట్టుకున్న వంటావిడ మోసుకొచ్చింది వార్త. రాత్రి స్టేషనుకి ఒక మైలు దూరంలో ఎవరో ఒక అమ్మాయి రైలుకింద పడి చనిపోయిందని. రాత్రంతా ఏడ్చిన బాబు నిద్రపోయాడు అప్పుడే. వాణ్ణలా వదిలేసి, కీడు శంకిస్తున్న మనసుతో వంటావిడ చెప్పిన చోటుకి వెళ్ళాను, చూద్దామని. మనిషి రూపం తెలియనంతగా ముక్కలయి వుంది శరీరం. బట్టలన్నీ, రంగునీ బట్టి మన జయేనని గుర్తించాను. ..........."

ఒక్క క్షణం పాటు నా తల దిమ్మెరపోయింది. దాన్నుంచి తేరుకునేసరికి నాకాయన మీద పట్టరాని కోపం వచ్చింది. "జయ చావుకి మీరే కారణం. నేను చచ్చిపోయాననుకున్నారా? ఒక్క మాట నాతో తన పరిస్థితి యిలా వుందని ఎందుకు చెప్పలేదు. మరుక్షణమే నేనేమయినా సరే వచ్చి తనని రక్షించుకునే వాణ్ణి. జరిగింది నాకే మాత్రం తెలీకుండా ఎందుకు దాచారు నాన్నగారూ? ఎందుకిలా చేశారు?" అన్నాను వస్తున్న ఏడుపును ఆపుకుంటూ.

ఆయనేమీ మాట్లాడలేదు. తనని చూస్తున్న కొలదీ నా దుఃఖం కోపం ఎక్కువవుతాయనుకున్నారేమో మెల్లిగా అక్కడ్నించీ లేచి వెళ్ళిపోయారు. ఆయనలా వెళ్ళగానే, తలగడని కరుచుకుని ఎంత సేపలా ఏడుస్తూవుండిపోయానో నాకే తెలీదు.

బాబు ఏడుపు వినిపించటంతో గుర్తొచ్చి గబగబా వెళ్ళాను లేచి. నాకు ప్రాణసమానమయిన జయనెలాగూ పోగొట్టుకున్నాను. తనకి గుర్తుగా మిగిలిన బాబునయినా రక్షించుకుని కళ్ళతో చూసుకోగలిగితే చాలు అనిపించి వెళ్ళి నాన్నగారి మాట వినకుండా మారాం చేస్తున్న బాబు నెత్తుకుని నా గదిలోకి తీసుకొచ్చాను. ఒక వయిపు

వస్తున్న ఏడుపు నాపుతుంటూ, మరో వయిపు బాబుని అనునయించ టానికి ప్రయత్నించాను.

"ఏడవకు నాన్నా! పొద్దున్నే నీకు మంచి బొమ్మలు, దండిగా స్వీట్సు తెచ్చి పెడతాగా? మా బాబు మంచివాడు."

"ఉహూ! నాకు స్వీట్సు, బొమ్మలూ వద్దు. మమ్మీ కావాలి డాడీ!" అంటూ బెక్కుతున్నాడు. "అమ్మనింకో పెద్ద ఆస్పత్రిలో వుంచారు బాబూ! బాగవగానే వచ్చేస్తుందిగా? నేన్రాలేదూ మరి. అలాగే, మమ్మీకి త్వరగా బాగవాలని రోజూ దేముడికి దణ్ణం పెడుతున్నావా మరి?"

ఏడుపు మరిచి పోయి, "అవును డాడీ! రోజూ రెండు సార్లు దండం పెడుతూనే వున్నా. మీరిద్దరూ బాగయి తొరగా ఇంటికి రావాలని" అన్నాడు.

"అలాగా? అందుకేగా నేనొచ్చేసింది. అలాగే మమ్మీకూడ వచ్చేస్తుంది. మరి నువ్విప్పుడు గుడ్‌బాయ్‌లా నిద్రపోవాలి." అని మెల్లిగా నిద్రపుచ్చాను. వాడ్ని నిద్రపుచ్చానుగానీ, నన్ను నిద్ర పుచ్చే వాళ్ళెవరు? ఆలోచనలు ఎక్కడెక్కడికో తీసుకెళ్తున్నాయి.

* * *

జయతో నా పరిచయం, అనుబంధం చిన్నప్పుడే మొదలయింది. తనతో మొదటగా నాపరిచయం అయేటప్పటికి నాకు పదేళ్ళుంటాయేమో! అప్పటికింకా పల్లెలోనే మా నివాసం. మాకున్న భూములలో వ్యవసాయం చేయిస్తుండేవారు నాన్న.

అమ్మకి నా తరవాత పిల్లలు పుట్టకపోవటం వల్లనేమో. నేనంటే బాగా గారం చేసేవారు అమ్మానాన్న. ఆ పల్లెలో చిన్న జమీందారులా వుండేవాణ్ణి. ఇంటా, బయటా స్కూల్లో అంతా జోరు చెలాయించేవాణ్ణి.

ఒకరోజు నేను స్కూలునుంచీ ఇంటికొచ్చేసరికి, మాఇంటి ముందున్న తోటలో ఓ అమ్మాయి ఆడుకుంటోంది. ఆ పిల్లను ఎప్పుడూ చూసిన గుర్తులేదు. ఎవరబ్బా అని ఆశ్చర్యపోతూ, దగ్గరగా వెళ్ళి "ఏయ్ పిల్లా, ఎవరునువ్?" అన్నాను.

"ఆయ్, నువ్వెవరో ముందుచెప్పు". నా మాటకి అలా ఎదురు చెప్పిన వాళ్ళంతవరకూ ఎవరూలేరు. నాక్కోపం వచ్చేసింది.

ఎర్రటి రిబ్బన్లతో ముడివేసుకున్న రెండు జడల్లో ఒకదాన్ని పట్టిలాగేను. "మా తోటలో ఆడుకుంటూ, పైగా నన్నే ఎవరని అడుగుతావా? నేనీ ఇంటికి యజమాన్ని తెలుసా?" అన్నాను పళ్ళు నూరుతూ.

జడ వదిలించు కోబోయింది. నే వదలక పోయేసరికి ఆరున్నొక్క రాగం మొదలు పెట్టింది. అంతలో అమ్మా, వెంట అమ్మ అంతేవున్న మరొక ఆవిడ బయటికొచ్చారు కంగారుగా.

"నువ్వేనట్రా? రాగానే మొదలు పెట్టావా గొడవ....ఈవి డెరో తెలుసా? మీ స్కూల్‌కి కొత్తగా వచ్చిన పంతులమ్మ. దండం పెట్టు" అంది అమ్మ.

అసలు ఈ పిల్లెవరో చెప్పకుండా గొడవేమిటి అనుకుని, అయిష్టంగానే దండం పెట్టాను.

"ఆ అమ్మాయి ఈవిడ కూతురు. రెండు రోజులు మనిం ట్లోనే వుంటారు. ఈ రెండు రోజులూ దాన్తో పోట్లాట పెట్టుకో కుండా, చక్కగా ఆడుకో," అంది.

"ఆఁ! ఆడుకున్నట్లే వుంది నాబొంద, పేరడిగితేనే ఏడు స్తోంది" అన్నాను కసిగా.

అమ్మ, ఆవిడ నవ్వుకుంటూ లోపలి కెళ్ళారు. తరవాత నాన్నగారి నడిగితే చెప్పారు. ఆవిడ, మా అమ్మకి చాలా స్నేహితు రాలట. కొత్తగా ఈ వూరికి ట్రాన్స్‌ఫర్ అయివచ్చారనీ, వాళ్ళకో ఇల్లు దొరికేదాకా మా ఇంట్లో వుంటారనీ తెలిసింది.

మరుసటి రోజే నేనూ, జయా స్నేహితులయి పోయాము. జయ తత్వమే అంత మొదటినించీ. మొదట పొగరుచూపి, నాకు కోపం తెప్పిస్తుంది. నేనేమయినా అంటే ఏడుస్తుంది. మళ్ళీ తనే కాళ్ళ బేరానికొస్తుంది.

మరురోజు తెల్లవారి లేచి దీపం పెట్టుకుని వసారాలో చదువు కుంటున్నాను. ఎప్పుడొచ్చిందో వచ్చి నా పక్కనే కూచుంది జయ.

"నీపేరు విశ్వంట కదూ? అత్తయ్య చెప్పింది, మరేమో నా పేరు జయలక్ష్మి" అంది.

"నీ పేరేదయితే నాకేం? నాపేరు విశ్వామిత్ర" అన్నాను ముభావంగా. "నిన్నటి కోపం ఇంకా పోలేదా?" అంది.

నేను పలక లేదు.

"మాట్లాడవూ? ఇంకెప్పుడూ అలా మాట్లాడనుగా? మనిద్దరం ఇవ్వాల్టినుంచీ జట్టు. 'ఊఁ' అను విశ్వం" అంది నా భుజం మీద చేయివేస్తూ. నా కోపం కరిగి పోయింది.

"ఆఁ! అలాగే........సరేగానీ, నిన్న జడ బాగా నెప్పి పుట్టిందా?"

"అబ్బే! అప్పుడే పోయిందిగా?"

అలా అలా కబుర్లు చెప్పింది. తామింతకు ముందు వుండి వచ్చిన పల్లె గురించీ, ఇంకా ఎన్నో. నేనడిగాను, "మరి మీ నాన్న గారేం చేస్తారు? ఎక్కడుంటారు?" అని.

అంతదాకా నవ్వుతూ వున్న జయ ఏడుపు ముఖం పెట్టింది. "నాకు నాన్న లేరుగా? మానాన్నని నేను చూడలేదు విశ్వం. ఆయన దేవుడి దగ్గిరికెళ్ళి పోయారట."

ఏడ్చేస్తుందేమోనని భయం వేసింది. తన చెయ్యి చేతిలోకి తీసుకుని, "పోన్లే ఇప్పుడవన్నీ ఎందుకు? అమ్మయినా వుందిగా? మా బళ్ళో ఒక పిల్లడికి అమ్మా నాన్నా ఇద్దరూ లేరు తెలుసా?" అని అనునయించటానికి ప్రయత్నించాను.

కానీ అప్పట్లో నాకూ అలాంటి పరిస్థితే వస్తుందనీ, నా కంటే చిన్నదయిన జయ నన్ను ఓదారుస్తుందనీ అప్పుడు నేనూహించ లేదు.

తరవాత నాలుగు రోజులకి నాన్న పంతులమ్మగారికో చిన్న ఇల్లు చూశారు. అందులోకి వెళ్ళిపోయారు జయా వాళ్ళమ్మా. అయినా రోజూ స్కూల్ కెళ్ళేటప్పుడు జయ వాళ్ళింటికెళ్ళి, వాళ్ళిద్దరితో కలిసిగానీ వెళ్ళేవాణ్ణికాదు. వాళ్ళమ్మని స్కూల్లో టీచర్ అనీ, ఇంట్లో అత్తయ్యా అని పిలిచేవాణ్ణి.

మళ్ళీ సాయంత్రం ఇద్దరం కలిసి మా తోటలో ఆడుకునే వాళ్ళం. చీకటి పడేముందు, ఇద్దరం కలిసి మా ఇంట్లోనే భోంచేసి మాపాలేరు వెంట వాళ్ళింటి కెళ్ళేవాళ్ళం. అక్కడే అత్తయ్య దగ్గర కాస్సేపు చదువుకుని మళ్ళీ ఇంటికొచ్చి పడుకునేవాణ్ణి.

జయతో పోట్లాటలూ, ఆటపాటల్తో దాదాపు రెండు సం॥ గడిచిపోయాయి. నాన్నకూడా వాళ్ళనెంతో అభిమానంగా చూసే వారు.

అనుకోకుండా మా అమ్మ అదేదో విషజ్వరానికి గురి అయింది. ఎంత బాగా ట్రీట్‌మెంట్ ఇప్పించినా లాభంలేక పోయింది. పదిరోజులు మంచంలో వుండి చనిపోయింది. అమ్మ పోయినందుకంటే నాన్న ఏడుస్తున్నందుకే నే నెక్కువగా ఏడ్చా నేమో అప్పుడు. ఆ సందర్భంలో జయ, జయ తల్లి మా కుటుం బానికి, మరింత దగ్గరయారు. వారం రోజులపాటు వాళ్ళిద్దరూ మా ఇంట్లోనే వున్నారు. వచ్చిన చుట్టాలంతా, "ఈవిడెవరు? ఇక్క డెందుకుంది" అని గుసగుసలు పోవటం నాకు బాగా తెలుసు ఆ విషయం అత్తయ్యకీ తెలుసు.

బంధువులంతా వెళ్ళిపోయారు. వున్నన్ని రోజులూ ఎవరి సుఖం వాళ్ళు చూసుకోవటమేగానీ నాన్న విషయం చూపిన వాళ్ళు లేరు. అత్తయ్య బలవంతం మీదనే ఆయన రోజూ ఒక్కసారయినా భోంచేసేవారు.

వారం రోజులకి అంది అత్తయ్య. "ఇంక మేం వెళ్ళొస్తాం అన్నయ్యా! పొయ్యిన వాళ్ళతో మనమూ పోలేం కదా? మీరు కాస్త కోలుకోకపోతే విశ్వం ఏమిటయి పోతాడు?"

"అదేమిటమ్మా అలాగంటావు? మాకింక మీరు తప్ప ఎవ రున్నారు. నువ్విక్కడే వుండిపోతే మాకు నిశ్చింత" అన్నాడు.

"అట్లా కాదులే అన్నయ్యా! ఎవళ్ళ యింట్లో వాళ్ళుండటమే మనకీ మనకీ మర్యాద. ఇళ్ళు వేరయితేనేం అభిమానాలుండాలి గానీ. పోనీ ఓ నెల రోజుల పాటు విశ్వాన్ని నా వెంట తీసుకెళ్ళేదా?"

"అలాగే నమ్మా నీ యిష్టం. రోజూ ఒకసారి పంపించు.

ఒడి ముఖం చూపి అయినా సంతృప్తి పడతాను. అంతకంటే నాకింక మిగిలింది మాత్రమేముంది?"

అత్తయ్య వెంట వాళ్ళింటికెళ్ళాను నేను. అమ్మ చనిపోయిన వెంటనే కంటే, వారం రోజులు తిరిగేసరికి ఆమె లేని లోటు నాకు బాగా తెలిసొచ్చింది.

జయతో మామూలుగా మాట్లాడుతూనే పరధ్యానంగా అయిపోయి అమ్మగురించి ఆలోచించేవాణ్ణి. నాకంటే నాలుగేళ్ళు చిన్నదయినా నా మనసుని చక్కగా అర్థం చేసుకునేది జయ. మేమిద్దరం పోట్లాడుకోకుండా వున్నదంటే ఆ నెల రోజు లేనేమో?

"మీ నాన్నలాగే, మా అమ్మ దేవుడి దగ్గిరికెళ్ళిపోయింది చూడు జయా! మా అమ్మ యింక రాదు కదూ?" అనడిగేవాణ్ని.

పెద్ద అరిందాలా. "పోన్లే విశ్వం! నాన్నయినా వున్నారుగా నీకు? మన బళ్ళో చదివే సూర్యానికి అమ్మా నాన్నా ఇద్దరూ లేరుగా పాపం!" అని ఓదార్చేది.

జయ స్నేహంలోనూ, అత్తయ్య ప్రేమలోనూ అమ్మలేని బాధ మరచిపోయే వాణ్ని. నాన్న మాత్రం ఎప్పుడూ దిగులుగా వుండేవారు.

తరువాత కొన్నాళ్ళకి జయ వాళ్ళమ్మకి మరోవూరు బదిలీ అయింది. వెళ్ళేటప్పుడు, నన్నుకూడా వెంటతీసికెళ్ళి తనతో వుంచుకుంటానని నాన్నని అడిగింది అత్తయ్య. ఆయన వప్పుకోలేదు. కనీసం నేనయినా లేకపోతే తనకి మరీ దిగులుగా వుంటుందని వద్దన్నారు. వాళ్ళు వూరు వదిలిపెట్టేటప్పుడు, అమ్మ పోయినప్పటి కంటే ఎక్కువగా ఏడ్చాను నేను. అప్పుడప్పుడూ వెళ్ళి జయని చూస్తుండవచ్చులే అని ఓదార్చారు నాన్న. కానీ తరవాత ఒక్కసారయినా వాళ్ళు రావడం గానీ, నేను వెళ్ళడంగానీ జరగలేదు. నన్ను తీసికెళ్ళేందుకు నాన్నకెప్పుడూ తీరుబాటు అయ్యేది కాదు.

చాలా ఏళ్ళదాకా నేను జయను చూడనేలేదు. నాన్ననోసారి అడిగితే, వాళ్ళు యిక్కడినించీ వెళ్ళిన ఊళ్ళో లేరనీ, బదిలీ అయి యింకెక్కడికో వెళ్ళారనీ చెప్పారు. చూడలేకపోయినా అప్పు

దప్పుడూ గుర్తుచేసుకునే వాణ్ని జయని.

* * *

నేను కాలేజిలో చేరేసరికి, నాన్న పల్లెలో వ్యవసాయం మానేసి, ఈ వూళ్ళో బిజినెస్‌లో ప్రవేశించటం, ఈ యిల్లు కట్టటం జరిగాయి.

ఎమ్. ఎస్. సి. పాసయిన కొత్తలో ఖాళీగా వుండటం ఎందుకని, కొత్తగా పెట్టిన ఆడపిల్లల కాలేజీలో వాలంటరీ జాబ్ చెయ్యమన్నారు నాన్న. కాలేజి చదువులో ఆడపిల్లలతో పెద్దగా స్నేహాలు లేక కాస్త బెదురున్నా కొత్త కాలేజి, స్ట్రెంత్ ఎక్కువ వుండదులే అనే ధైర్యంతో ఆ జాబ్‌కి వప్పుకున్నాను.

మొదటి రోజు భయపడుతూనే బి. యస్. సి. ఫస్టియర్ క్లాస్‌కి వెళ్ళాను. సీరియస్‌గా వుంటే భయపడుతున్నాననుకుంటా రేమోనని వెళ్ళగానే చిరునవ్వుతో నన్ను నేను పరిచయం చేసుకున్నాను. ఒకసారి క్లాసంతా కలయజూశాను. మొత్తం పదిమంది అమ్మాయిలున్నారు. అంతా కలిపి నాలుగు బెంచీల్లో కూచుని వున్నారు.

నన్ను నేను పరిచయం చేసుకోవటం అయాక ఒక్కొక్క రినే వాళ్ళ పేర్లు అడిగాను. ఒక్కొక్కరు ఒక్కోరకమయిన స్టయిల్‌లో లేచి చెబుతూవుంటే సరదాగా విన్నాను. చివరనున్న అమ్మాయి ప్రవర్తనతో ఖంగు తిన్నాను. "నెక్స్ట్" అన్నా పట్ట నట్లు ఏదో చదువుకుంటూంది సీరియస్‌గా. ఏం చేయాలో తోచలేదు నాకు.

ఇంతలో పక్కనున్న అమ్మాయెవరో పొడిచేసరికి లేచి నిలుచుంది గబాలున తాపీగా అడిగింది. "ఏఁవిటి మాష్టారూ అడి గేరు?" అని.

వళ్ళు మండింది నాకు. తమాయించుకుని, "యువర్ నేమ్ ప్లీజ్" అన్నాను.

"ఓ! మైనేమ్ ఈజ్ జయలక్ష్మి సర్" అని టప్‌మని కూచుని మళ్ళీ తన పుస్తక పఠనంలో నిమగ్నమయింది. ఈ అమ్మాయి

నెలాగయినా నా పాఠంలో ఇంటరెస్ట్ కలిగేలా చేయాలని నిశ్చయించు కుని టీచింగ్ మొదలు పెట్టాను.

ఆవాళ ఆర్గానిక్ కెమిస్ట్రీ, సబ్‌స్టిట్యూషన్ రియాక్షన్స్ గురించి చెప్పాలని ప్రిపేర్ అయి వచ్చాను. ఎలక్ట్రోఫైలిక్ టైప్‌తో మొదలు పెట్టాను. ఎలక్ట్రోఫైల్ అంటే ఏమిటి? సబ్‌స్టిట్యూషన్ అంటే ఏమిటి? ఎలెక్ట్రాన్ డెఫిషియెంట్ సెంటర్స్‌కి ఉదాహరణలేమిటి— అని వరసాగ్గా ఒక్కొక్కటే వివరిస్తూ వచ్చాను.

మెల్లిగా ఆ చివరి బెంచీలో అమ్మాయి చేతిలో వున్న పుస్తకాన్ని కిందపెట్టి, గడ్డంకింద చేయి పెట్టుకుని శ్రద్ధగా వినసాగింది. మరింత ఉత్సాహంగా చెప్పటం మొదలు పెట్టాను.

అంతా అయ్యాక, "హావ్ యూ గాట్ ఎనీ డౌట్స్?" అని అడిగాను. ఆ అమ్మాయి టప్‌మని లేచి నిలుచుని "అసలేమయినా అర్థం అవుతే కదా మేష్టారూ డౌట్స్ అడగటానికి?" అంది.

చెప్పినంతసేపూ అర్థం అవుతున్నట్లుగా విని, ఇప్పుడిలా అనేసరికి, చాలా కోపం వచ్చింది నాకు. అయినా కోపానికిది సమయం కాదని తమాయించుకున్నాను. మరోసారి వివరించాను.

చివర నోట్స్ చెబుదామని పేపర్స్ బయటికి తీశాను. మళ్ళీ నిలబడిందా మహాతల్లి. "ఆ నోట్స్ మీరు తయారుచేసిందేనా, లేక మీరు బియ్యెస్సీలో ఉండగా మీ మాష్టారు చెప్పినదే తీసిపెట్టారా?" అంది.

ఆ అమ్మాయి కావాలనే నన్ను రెచ్చగొట్టాలనే అలా చేస్తూందని అర్థం చేసుకున్నాను. ఘాటుగా సమాధానం చెబుదామనుకున్నాను. ఇంతలో బెల్ మోగటంతో వెళ్ళిపోయాను. నా వెనకాల అమ్మాయిల నవ్వులు నా చెవులబడకపోలేదు. ప్రతీకారమెలా తీర్చుకోవాలా అని అప్పటినించే ఆలోచించటం మొదలుపెట్టాను.

మరుసటిరోజు మామూలుగా క్లాస్‌కి వెళ్ళాను. సీరియస్‌గా ఎటండెన్స్ తీసుకుని, వెంటనే ప్రశ్నలు వేయటం ప్రారంభించాను, ముందురోజు పాఠంలో. కొంతమంది సరియయిన జవాబు లివ్వటం, కొందరు చెప్పలేకపోవటం జరిగాయి. ఎవర్నీ ఏమీ అనలేదు గానీ,

ఆ చివరి బెంచీ అమ్మాయిని మాత్రం నిలుచోబెట్టి, పదిహేను నిమిషాలు తిట్టి నా కోపం తీర్చుకున్నాను.

"కొత్తగా వచ్చిన మేష్టార్ని అల్లరి పెట్టగానే సరికాదు, చెప్పిన పాఠం చెప్పినప్పుడు శ్రద్ధగా వినటం నేర్చుకోవాలి. విన్నది చక్కగా చదవనిదే అసలు క్లాస్‌కి రాకుండా ఉండటమే మంచిది. అంత ఇంటరెస్ట్ లేనప్పుడు కాలేజికి రావటం ఎందుకు? ఆ చదివే నవల్స్ ఏవో ఇంట్లోనే చదువుకుంటూ నిద్రపోవచ్చుగా?

"చక్కగా తయారయి కాలేజీకి రాగానే సరికాదు, మర్యాదగా ప్రవర్తించటం కూడా నేర్చుకోవాలి. మాష్టారంటే మీకంటే అంతో ఇంతో ఎక్కువ తెలిసినవారే అయుంటారని తెలుసుకోవటం మంచిది...."

ఇన్ని మాటలు మాట్లాడేకగానీ నాకు, నేను మాట్లాడుతున్నది ఓ అమ్మాయితోననీ, అప్పటికే ఆ హీరోయిన్ ముఖం దైన్యంగా మారిపోయిందనీ గుర్తించలేదు. దానితో "సిట్ డౌన్" అనేసి, పాఠం చెప్పటం మొదలు పెట్టాను. తరవాతిక ఆ అమ్మాయి ముఖంవయిపు చూడనేలేదు.

సాయంత్రం కాలేజి వదిలారు. ఆవాళ నా 'రాజ్‌దూత్' రిపేర్‌కి వెళ్ళి వుండటంవల్ల నడిచే వెళుతున్నాను. అరఫర్లాంగు దూరం నడిచేక నా వెనకెవరో గబగబా నడిచి వస్తున్నట్లయింది. తిరిగి చూశాను. ఒక్కక్షణం నిలుచుని. ఇంతలో వచ్చి కలుసుకుంది క్లాసులో నాతో తిట్లుతిన్న అమ్మాయి.

అప్పుడు పరీక్షగా చూశానామెని. డార్క్ ఆరెంజ్ కలర్ చీర కట్టుకుని వుంది. పొడవాటి రెండు జడలూ, చేతులకి ఆరంజ్ రంగువే గాజులూ, గుండ్రటి ముఖాన అదేరంగు బొట్టు-చూడగానే ఆకర్షించేలా వున్నాయ్. క్లాస్‌లో నే తిట్టినప్పు డెంత దైన్యంగా వుందో ఇప్పుడూ అలాగేవుంది. రెండు చేతుల్తో పుస్తకాలని గుండెల కదుముకుని, తలవంచుకుని నిలుచుంది.

"యస్. వాట్ డుయూ వాంట్?" అన్నాను గంభీరంగా.

"అయామ్ వెరీసారీ. నన్ను క్షమించండి మేష్టారూ!

కొత్తగా వచ్చిన మేష్టారు కదా అని సరదాకి కాస్త అల్లరి చేశాను గానీ మీకంత కోపం వస్తుందనుకోలేదు. నిజంగా క్లాస్‌లో నవల్స్ చదివే అలవాటుకూడా లేదు.

"కాలేజీకి సరదాకి వచ్చేంత గొప్పవాళ్ళమూ కాదు మేష్టారు మేము...."

అంతదాకా తన ముఖాన్ని గమనిస్తున్న నా మనసులో ఏవో జ్ఞాపకాలు కదిలాయి.

"పోనీలేగానీ, మీ పేరేమిటన్నారు?" అన్నాను సందేహంగా.

"జయలక్ష్మి సర్" అంది చిరునవ్వుతో.

"మీ ఫాదరేం చేస్తారు?"

"నాకు నాన్న లేరండీ. మా అమ్మ హైస్కూల్లో టీచర్. నాకోసమే బతుకుతోంది ఆమె. నేనిలా మీకు కోపం తెప్పించి మీతో తిట్లుతిన్నానని తెలిస్తే చాలా బాధపడుతుంది ఆవిడ."

గబగబా అడిగాను. "ఆవిడపేరు రాజ్యలక్ష్మిగారు కదూ? నువ్వు మూడో తరగతి చదివేటప్పుడు మీరు రామాయపాలెంలో వున్నారు కదూ?" అవునంటే బావుండుననే ధోరణిలో అన్నాను.

"అవును. మా అమ్మపేరు రాజ్యలక్ష్మి. మీకెలా తెలుసు? నాకంత బాగా గుర్తులేదుగానీ, రామాయపాలెం గురించి మా అమ్మ ఎప్పుడూ చెబుతూంటుంది...."

"విశ్వమిత్ర అనే ఒక అబ్బాయిగురించి కూడా ఎప్పుడయినా చెప్పారా మీ అమ్మ" ఆత్రంగా అడిగాను.

ఆ అమ్మాయి కళ్ళు ఆశ్చర్యంతో మెరిసాయి. "అవునండీ ....మీరు...."

"నేను....ఆ విశ్వమిత్రనే, నీ బాల్య స్నేహితుణ్ణి. అయితే గుర్తున్నానన్న మాట."

"గుర్తు లేకేం. అమ్మ మిమ్మల్నిగురించి అనుకుంటూనే వుంటుంది" "అమ్మేనా? మరి నువ్వో?" చిలిపిగా ఆమె ముఖంలోకి చూశాను. సిగ్గుతో తలవంచుకుంది.

"ముందుకి నడుద్దాం పద. ఇలాగే వీధిలో నిలుచుంటే

బావుండదు" అన్నాను.

"మా ఇల్లు ఇక్కడికి చాలా దగ్గిర. ఒక్కసారి అమ్మని చూద్దురుగాని రారూ?" అంది.

"రమ్మని నువ్వడగాలా? నువొద్దన్నా ఇప్పుడు నీవెంట వచ్చి నేను అత్తయ్యని చూడాలనుకుందే."

అయిదు నిముషాల్లో వాళ్ళిల్లు చేరాము. అత్తయ్యలో వయసు తెచ్చిన మార్పు ఎంతోవున్నా, నాకు గుర్తున్న ప్రశాంతమయిన ఆ ముఖం, ఆవిడ ఆప్యాయత ఎప్పటిలానే వున్నయ్.

నన్ను చూచిన వెంటనే గుర్తుపట్టలేక పోయిందావిడ. జయే పరిచయం చేసింది.

"ఈయనెవరో తెలుసా అమ్మా? ఎప్పుడూ విశ్వం అని చెబుతుండే దానివే ఆయనే. మాకు కొత్త కెమిస్ట్రీ మేష్టరుగా వచ్చారు. ఇవాళ నన్ను చూసి గుర్తుపట్టి నిన్ను చూడాలని వచ్చారు" అంది ఉత్సాహంగా.

"అరే విశ్వం నువ్వా బాబూ? ఎంత పెద్దవాడి వయావు: నేను చూసినప్పుడు ఇంతుండే వాడివి నిక్కర్లేసుకుని. రారా ఇలా కూర్చో." అంటూ కుర్చీ ఒకటి చూపించింది.

నమస్కారం పెడుతూ, చిరునవ్వు నవ్వి కూచున్నాను. అదో రెండు గదుల పెంకుటిల్లు. అప్పుడే గమనించాను, అత్తయ్య నేనొచ్చేసరికి మంచం మీద పడుకునుందనీ, ఆవిడ ముఖం సుస్తీ చేసినట్లుందనీను.

వెంటనే అడిగాను, "అదేమిటలా వున్నారు? వంట్లో బావు లేదా అత్తయ్యా" అన్నాను. ఇంతలో జయ లోపలికెళ్ళింది కాఫీ తీసుకొస్తానని.

"అవును బాబూ! ఏదో ఇలాగే లాగేస్తున్నాను. పనిచేయటం కూడా కష్టంగానే వుంది. సుస్తీ ఒకటనీ కాదులే. మా జయకి పెళ్ళయి పోతే నాకింక దిగులుండదు."

లోపల్నుంచే కేకేసింది జయ. "వచ్చిన వాళ్ళందరితో నా పెళ్ళి గురించి మాట్లాడేవంటే, నీతో మాట్లాడను చూడమ్మా."

"ఇదీ దీని వరస. చదువుకుని ఉద్యోగం చేస్తానంటుంది. నాకు మాత్రం ఉద్యోగాలు చేసి నాలా తిప్పలు పడటం ఏమాత్రం ఇష్టంలేదు." అంది అత్తయ్య.

కాస్సేపదీ ఇదీ మాట్లాడేక, "జయ నివాళ నాతో తీసి కెళతానత్తయ్యా" అన్నాను.

ఒక్కక్షణం ఆవిడేమీ చెప్పలేదు. తరవాత అంది. "మీ మేలు కోరి చెబుతున్నాను. నువ్వు మాతో అంత బాంధవ్యం పెట్టుకోకుండా వుంటేనే మంచిది విశ్వం." ఆవిడలా ఎందుకంటూందో నాకర్థంకాలేదు.

"ఎందుకలా అంటున్నారు?" అనడిగాను అయోమయంగా.

"సమయం వచ్చింది కనుక చెబుతున్నాను. మీ చిన్నప్పుడే నిన్ను నా దగ్గర చేర్చుకుని, నా కూతురి కోసం నీపయిన వల వేస్తున్నానని, కొందరు చెప్పిన మాటలు విని మీ నాన్నగారు అపోహ పడ్డారు.

"ఆ అపోహ తొలగించే ఉద్దేశంతోనే నేను మీకు కావాలనే దూరం అయాను. నేనెక్కడున్నదీ కూడా మీకు తెలియకుండా గడపానిన్నాళ్ళూ. విధివిలాసం ఎలా వుంది చూడు బాబూ, నా ప్రమేయం లేకుండానే, నువ్వు మమ్మల్ని గుర్తించావు....అయినా నువ్వు మాకు దూరంగా వుండటమే అందరికీ శ్రేయస్కరం.... ఏమంటావు విశ్వం?"

ఆవిడ మాటల్ని అంత సీరియస్‌గా తీసుకోవాలన్పించలేదు నాకు. "పొండి అత్తయ్యా! ఎప్పుడో మా చిన్నప్పుడు ఏవో అపోహలు పడినంతమాత్రాన, ఇంకా ఆ భేదాలు అలాగే వుంటాయా నాన్న మనసులో. ఎప్పుడో మరిచి పోయుంటారు. మళ్ళీ ఇప్పుడు జయని చూస్తే తప్పక సంతోషిస్తారు," అన్నాను.

"నే చెప్పేవి చెప్పాను. నీ ఇష్టం బాబూ!"

కాఫీ తాగటం అయాక జయని మా ఇంటికి తీసికెళ్ళాను. ఇంట్లోనే ఉన్నారు నాన్న. పక్కనున్న జయని చూడగానే, "ఎవరు బాబూ? ఆ అమ్మాయి......... ఇంతాలస్యం అయిందేం

ఇవాళ?" అన్నారు.

"ఇదిగో ఈవిడ వల్లనే ఇంటికి రావటం ఆలస్యం అయి పోయింది నాన్నా. ఈమెవరో తెలుసా? నా చిన్నప్పుడు అమ్మ స్నేహితురాలు పంతులమ్మగారు లేరు ఆవిడిగారి అమ్మాయి జయ లక్ష్మి. నా బాల్య స్నేహితురాలు" అన్నాను ఉత్సాహంతో ఆయన రియాక్షన్ చూడటానికి ప్రయత్నిస్తూ.

"అహా! అలాగా. ఏం చదువుతున్నావమ్మా?" అన్నారు నిర్లిప్తంగా. "మా కాలేజిలోనే బియ్యేస్సీ ఫస్టియర్ స్టూడెంట్ నాన్నా. నేను వాళ్ళ కొత్త మేష్టార్ని కదూ?"

జయ తరపున నేను జవాబివ్వటం ఇష్టంలేనట్లుగా ముఖం పెట్టి, "మీ అమ్మగారు బాగున్నారా అమ్మా?'' అన్నారు.

"బాగానే వున్నారండి" అంది జయ వినయంగా. "మంచిది. లోపలికెళ్ళి కాస్త కాఫీ అదీ ఇస్తావేమో ఇవ్వు బాబూ ఆ అమ్మాయికి" అంటూ పేపర్లో తల దూర్చారాయన. అత్తయ్య మాటల్లో వున్న అర్థం బోధపడిపోయింది నాకు. అయినా నిరుత్సాహ పడదలచుకోలేదు నేను. జయను తీసుకుని నాగదిలో కెళ్ళాను.

* * *

నా ఆలోచనల్లో నేనుండగానే తెల్లవారింది. కిటికీలోంచి చల్లటి గాలి వీస్తుంది. అమాయికంగా నిద్రపోతున్న బాబు ముఖం లోకి ఒకసారి చూసి దుప్పటి కప్పిలేచాను.

యాంత్రికంగా ముఖం కడుక్కొని, స్నానం చేసి వచ్చాను. గోపీ కాఫీ ఇస్తూ చెప్పాడు. "వంటావిడ ఇవాళ రాదట. టిఫిన్ హోటల్నించీ తేనా బాబుగారూ?" అన్నాడు. సరేనని చెప్పి డబ్బిచ్చి పంపాను. ఇంతలో బాబు లేస్తే ముఖం కడిగించి, ఫ్లాస్కులో వున్న హార్లిక్స్ తాగించాను.

నాన్న ఇంకా తన గదిలోంచి బయటికి రాలేదు. గంట ఎనిమిదయే దాకా పడుకునే అలవాటులేదు. మరి ఏం చేస్తున్నారో తెలియదు. గోపీ టిఫిన్ తెచ్చాడు. "డాడీ! నాకు ఇడ్లీ పెట్టవూ?"

అన్నాడు బాబు.

సరేనని డైనింగ్ రూమ్‌లోకి తీసికెళ్ళి గోపీని ప్లేట్ పెట్టమని చెప్పి, పేకెట్ చేతిలోకి తీసుకున్నాను. విప్పబోయి, దానికి కట్టి వున్న పేపరు పైనున్న ఫోటో చూసి ఉలిక్కిపడ్డాను.

గబగబా విప్పి అందులోని ఇడ్లీలు ప్లేట్‌లో పెడుతున్నానా లేదా కూడా గమనించకుండా పేపర్‌ని వెడల్పుగాచేసి చేతిలోకి తీసుకుని పరీక్షగా చూశాను. అదో నెలరోజుల క్రితం న్యూస్‌పేపర్ ముక్క.

సందేహంలేదు. అది జయ ఫోటోనే. దానికింద ఇలా రాసి వుంది-"దాదాపు ఇరవయిరెండు. ఇరవయిమూడేళ్ళ వయసుగల పై ఫోటోలోని అమ్మాయి తాలూకు వారెవరయినా వున్నచో, ఈ క్రింది అడ్రసుకి వచ్చిన ఎడల ఆమెను కలుసుకొనవచ్చు."

గబగబా కిందున్న చిరునామా చదివాను. ప్రకటన చదవగానే ఎంత సంతోషం కలిగిందో, అంతకన్నా మరింత ఆనందించాను చిరునామా చూసి. కారణం ఆ చిరునామా వ్యక్తి ఎవరోకాదు. నా ప్రాణ స్నేహితుడు చక్రవర్తి. మేమిద్దరం కలిసి మూడేళ్ళు కాలేజిలో చదివేటప్పుడు రూమ్ మేట్స్‌ము.

"ఇడ్లీ పెట్టు డాడీ!" అంటున్న బాబు మాటలకి ఉలిక్కిపడి, "అరే బాబూ! మీ అమ్మ బ్రతికే వుందిరా. ఇవాళే వెళ్ళి తీసుకొస్తాను" అంటూ ఉత్సాహంగా బాబు నెత్తుకున్నాను. పేపర్ పుచ్చుకుని నాన్న గదివయిపు నడిచాను.

"నాన్నా! నాన్నా" అరుస్తున్న నా కేకలకి ఆదుర్దాగా బయటి కొచ్చారు ఆయన. సంతోషంగా చేతిలోవున్న పేపర్ ముక్క అందించాను.

రెండు క్షణాల్లో చదివేసిన ఆయన, "అబ్బ! దేవుడెంత దయామయుడు విశ్వం! రాత్రి నీ మాటలు విని నువ్వేమయిపోతావో నని నేనెంత భయపడ్డానో? జయ వుందంటే అదే పదివేలు. ఇవాళే ప్రయాణమయి వెళ్ళి తీసుకురా. బాబుని నే చూసుకుంటాను" అన్నారు.

అప్పుడు రాత్రి నేను ఆయన్తో అన్నమాటలు గుర్తొచ్చి సిగ్గు పడ్డాను. "నన్ను క్షమించండి నాన్నా. రాత్రి పిచ్చివాడిలా ప్రవర్తించి మీ మనసు నెంతో నొప్పించాను. మేమిద్దరం లేక బాబుతో మీరెన్ని తిప్పలు పడ్డారో పాపం!"

"పోన్లే బాబూ ఇప్పుడవన్నీ ఎందుకు? అమ్మాయి బ్రతికే వుంది. అంతే చాలు. త్వరగా ప్రయాణం అవ్వు" అన్నారాయన తేటపడిన ముఖంతో, బాబు నెత్తుకుంటూ. వెంటనే గోపీకి చెప్పాను, పెట్టె బెడ్డింగూ సర్దమని.

* * *

## జయలక్ష్మి:

భగవాన్! నాదెంత చిత్రమయిన బ్రతుకు. ఎక్కడ పుట్టానో, ఎలా పెరిగానో తెలియదు. పుట్టాక ఏ ఇరవయిఏళ్ళ పైనో గడిచాక కళ్ళు తెరిచాను. అంతకు ముందేమి జరిగిందీ నాకు తెలీదు.

వారి తోటలో వచ్చి స్పృహలేకుండా పడివుంటే నన్ను రక్షించారు చక్రవర్తిగారు, వారి అమ్మ. నేను మొదటగా కళ్ళు తెరిచింది వారి ఇంట్లోనే. అందుకేనేమో వారు నాకెంతో ఆత్మీయులుగా కనిపిస్తారు. వారే రక్షించకపోతే నేనేమయి పోయేదాన్నో అనే కృతజ్ఞతతోను, కళ్లుతెరిచి గుర్తు తెలిసినప్పట్నించీ వారు నాపై చూపిన ఆత్మీయతతోను వారికి మరింత దగ్గరయ్యాను.

నా ఫోటో పేపర్లోవేసి ప్రకటిస్తే, నా తల్లిదండ్రు లెవరో వస్తారని చక్రవర్తి అన్నారుగానీ, నిజానికి నేను వీళ్ళని వదిలివెళ్ళి బ్రతకగలనా అనిపిస్తుంది. అయినా నాకూ, వీరికీ ఏం సంబంధం వుందని వీరికి శాశ్వత భారంగా వుండిపోగలను?

ఇలాంటి మీమాంసలో నేనుండగానే, హఠాత్తుగా ఓరోజు చక్రవర్తి నన్ను పెళ్ళాడదలచుకున్నట్లు అభిమతాన్ని వ్యక్తం చేశారు. నా సంతోషానికిక అవధుల్లేవు. నాకంటే అదృష్టవంతు లింకెవరూ ఉండరనుకున్నాను. స్వర్గంలాంటి ఈ ఇంటిలో, దేవత

లాంటి అమ్మగారి సన్నిధిలో జీవితం అంతా గడిచిపోవటం కంటే కావలసిందేముంది?

కానీ.... నా అంగీకారంతో వారు సంతృప్తి పడలేదు. నావారెవరో రావాలనీ, వారి పర్మిషన్ తీసుకోవటం ముఖ్యమనీ వారు అనుకున్నారు. కానీ చిత్రమేమిటో పేపర్లో ప్రకటన వేయించి నెల దాటినా ఎవరూ వచ్చే జాడలు కన్పించలేదు. అసలు నావారంటూ ఎవరయినా వున్నారా లేదా అని కూడా నాకు అనుమానం వేయక పోలేదు. అదే దిగులుతో, ఆత్రుతతో గడిపాను కొన్నాళ్ళు అశాంతిగా.

చక్రవర్తి నా మనసుకెంత దగ్గర వారయిపోయారంటే, వారు నా ముఖం చూసే మనసులో ఏమున్నదీ కనిపెట్టేస్తారు. ఆయనకి నామీదంత అభిమానమెలా, ఎందుకు ఏర్పడిందీ నాకిప్పటికీ ఆశ్చర్యంగానే వుంటుంది.

వారికేం తక్కువ? చదువు, మంచి ఉద్యోగం, ఆస్తి, అందం అన్నీ వున్నయ్. ఆయనే అనుకుంటే నాకంటే ఎన్నోరెట్లు మిన్న అయిన అమ్మాయి దొరక్కపోదు. అయినా ఆయన నన్నే కోరుకుంటున్నారంటే నిజంగా నా అదృష్టం కాక మరేమిటి? ఈ జీవితానికి ఆయన అభిమానం ఒక్కటే చాలు.

నాకు గుర్తు తెలిసినంతలో చేసుకున్న మొదటి పండుగ దీపావళి. అదెలా చేస్తారో వారం రోజులనించీ చెబుతూనే వున్నారు అమ్మ. చక్రవర్తి బలవంతంగా వెంట తీసికెళ్ళి కొత్త చీరలు కొని పెట్టారు. పండుగరోజు ఉదయంనుండీ సాయంత్రందాకా ఎంతో సరదాగా గడిచిపోయింది.

ఉదయంనుండీ చక్రవర్తి నాతో ఏకాంతంగా మాట్లాడాలనుకుంటున్నారని అర్థమయింది, అయినా నా అంత నేను అవకాశం కల్పించుకోదలచుకోలేదు. సాయంత్రం అమ్మగారితో కలిసి దీపాలు పెడుతున్నాము. రంగయ్యవచ్చి చెప్పాడు, "బాబుగారు పిలుస్తున్నారని."

ఎందుకోననుకుని వెళితే, పండుగనాడు తన ప్రజంటేషన్

అని చక్కని ముత్యాల నెక్‌లెస్ ఇచ్చారు. ఏమిటో ఆయన పిచ్చి! అనవసరంగా అంత ఖరీదుపెట్టి తేకపోతేనేం? ఎంత ఖరీదయిన వస్తువయినా, వారి అభిమానం విలువచేస్తుందా? అయినా ఎవరి పిచ్చివారి కానందం. కాదంటే బాధపడతారని పుచ్చుకున్నాను.

నెక్‌లెస్ గురించి అమ్మగారి కెలా చెప్పాలా అని ఎంత సిగ్గు పడ్డానో? అయినా ఏమీ అడక్కుండానే అన్నీ తెలుసుకోగల ఇంగితం ఉందావిడకి. ఒక్క క్షణంపాటు దానివయిపు దృష్టి సారించి, "చాలా బావుంది సంధ్యా నీ మెడలో" అన్నారేగానీ, ఇంకేమీ ప్రశ్నించలేదు.

అనుకోకుండా అమ్మగారు వూరెళ్లారు. దాంతోటే నా దుర దృష్టం మొదలయిందని నాకావేళ తెలీదు. ఆవిడ లేకపోతే వంట రిగా వుండాల్సి వస్తుందని బెంగ పెట్టుకున్నానుగానీ, చక్రవర్తి స్నేహంలోనూ, ప్రేమలోనూ సర్వం మరిచి సంతోషంగా వుండ గలిగాను. తుఫానుముందు ప్రశాంతత అంటే ఇదే కాబోలు. అంత ఆనందంనించీ, అగాధంలాంటి దుఃఖంలో పడిపోతానని ఒక్క సారయినా ఊహించనేలేదు.

అమ్మగారు వూరెళ్ళిన మూడవరోజు సాయంత్రం షికారు కెళ్ళాలని తయారవమన్నారు చక్రవర్తి. ఆయన తయారయి సోఫాలో కూచుని వున్నారు. నేను నాగదిలో డ్రస్ మార్చు కుంటున్నాను.

ఇంతలో బయటెవరో ఆయన్తో మాట్లాడుతున్నట్లు విన్పిం చింది. "హాయ్! విశ్వామిత్ర మహామునీ, ఎప్పుడు రావటం? ఎన్నా ళ్ళకు దర్శనం? ఏమిటీ హఠాత్ ఆగమనం?"

ఆయన ప్రశ్నలకి నవ్వొచ్చింది నాకు. ఇవాళ్లికి షికారు కాన్సిలే, ఇక వచ్చిన అతిథికేమయినా కావాలేమో చూద్దామని నింపా దిగా తలుపు తెరిచాను. సోఫాలో చక్రవర్తి పక్కన దాదాపు అంతే వయసూ, ఒడ్డు పొడవూగల వ్యక్తి ఒకరు కూర్చుని వున్నారు.

"ఒకేసారి అన్ని ప్రశ్నలేస్తే ఎలారా జవాబు చెప్పటం? ముఖ్యమయిన పనిమీదే నిన్ను వెతుక్కుంటూ వచ్చాను. ఆ మధ్యనో

సారి. నాకూ, నా మిసెస్‌కీ బైక్ మీదో ఆక్సిడెంట్ అయింది. ఆ ఆక్సిడెంట్‌లో ఆవిడ మైండ్ బాగా దెబ్బతిని ఇల్లువిడిచి వెళ్ళిపోయింది ........"

చక్రవర్తి ముఖంలో మార్పుల్నయినా గమనించకుండా మాట్లాడుతున్న ఆ కొత్తవ్యక్తి తలుపు తీసిన నా వయిపు చూపి ప్రాన్పడిపోయాడు. ఆయన నోటిలోంచి మాటే రావటంలేదు.... "జయా....నా జయా...." అన్నారు అతి కష్టంమీద. ఆయనెవర్ని పిలుస్తున్నారో నాకర్థం కాలేదు.

చక్రవర్తి పరిస్థితీ అలాగే వుంది. "విశ్వం! ఏమిట్రా నువ్వంటున్నది?" అన్నారు ఆదుర్దాగా.

చూపుల్ని నావయిపు నుండీ తిప్పకుండానే, "అవునురా చక్రం! ఈమె నా భార్య. నేను పోగొట్టుకున్నా ననుకున్న నా ప్రాణం. నా ప్రాణాన్ని నాకు దక్కించి భద్రంగా అప్పగిస్తున్న నీకు నేనేమివ్వ గలనురా? ఈ బ్రతుక్కిక అర్థమే లేదనుకున్న నాకు పీడకల చెదిరిపోయినట్లుగా, నీ ప్రకటన దొరికింది. అంతే పరిగెత్తి వచ్చాను. ఇప్పుడు తన ఆరోగ్య మెలా వుంది? ఎందుకురా అలా రిచ్చపోయి చూస్తావ్? మాట్లాడు, నువ్వైనా మాట్లాడు జయా!" ఆయన గబగబా మాట్లాడేస్తున్నారు.

భగవాన్! ఇదెంత అన్యాయం. నాకు తెలికుండానే నాకు పెళ్ళికూడా అయిపోయిందా? ఈ ఇంట్లోనే జీవిత మంతా గడపగల నని నమ్మిన నా గుండెల్లో రాయివేస్తూ ఈయనెవరో నేను నీ భర్త నంటూ వచ్చారే? ఏమిటి చేయడం? నాకు మాత్రం ఆయన్నెక్కడా, ఎప్పుడూ చూపిన గుర్తైనా లేదు.

చక్రవర్తి ముఖం తెల్లగా పాలిపోయింది. ఆయన బాధ నేనర్థం చేసుకోగలను. తాను మనసారా ప్రేమిస్తున్నదో మగనాలి ననీ, అదీ తన ప్రాణస్నేహితుడి భార్యననీ తెలిసాక ఆయన మనస్థితెలా వుంటుందో ఊహించగలను.

భగవాన్! నన్నెందుకీ ఇంట్లో చేర్చావు. తాత్కాలికంగా నా అంత అదృష్టవంతు రాలెవరూ లేకుండా, దేవతల్లాంటి ఈ తల్లీ

కొడుకుల అభిమానాని కెందుకు గురి చేశావు? ఇంతాచేసి ఈయనెవర్నో నా భర్తపేరు మీదుగా ఎందుకిలా పంపించావు? నేనేం పాపం చేశాను? నాకు తెలీకుండా అయిన పెళ్ళిని, భర్తని నేనెలా అంగీకరించను?

చక్రవర్తి మెల్లిగా తేరుకుని మాట్లాడారు. "సంధ్యా! ఈయనెవరో నీకు తెలుసా?" అన్నారు. తెలీదన్నట్లు తల అడ్డంగా తిప్పాను. ముగింపెలా జరగనున్నదీ తెలియని స్థితిలో వున్నాను నేను.

"చూశావా విశ్వం? ఇదీ పరిస్థితి. మా ఇంటిముందు స్పృహ తప్పి పడివుంటే ఇంట్లోకి తీసుకొచ్చి ట్రీట్‌మెంట్ ఇప్పించాము. మెలకువ వచ్చాక అడిగితే తనకేమీ గుర్తులేదంది. ఏదయినా ఆక్సిడెంట్‌కి గురయి వుండవచ్చునని అన్నారు డాక్టర్. ఆవిడ కాస్త తేరుకుందుకు టయిమిచ్చి పేపర్లో ప్రకటించాను.

"ఇన్నాళ్ళకి నువ్వొచ్చావు. మీ మిసెస్‌ని నీ చేతుల్లో పెడుతున్నాను. నా బాధ్యత తీరిపోయింది" అని ముగించారు చక్రవర్తి. ఇంకా ఏదో చెప్పాలనుకుంటున్నారనీ, కానీ మాటలు బయటికి రావటంలేదనీ గుర్తించాన్నేను.

ఎంత తేలిగ్గా నిర్ణయించారు చక్రవర్తి! నా మీద పెంచుకున్న అభిమానాన్ని అంత తేలికగా ఎలా చంపుకున్నారో? అయినా ఆయన మాత్రమేం చేస్తారు? నాకా ఏదీ గుర్తులేదు. స్నేహితుడొచ్చి నన్ను గుర్తించి తన భార్య అని అంటున్నాడు. కాదని ఆయనెలా అనగలరు? ఇప్పుడు నేనీయనతో వెళ్ళిపోతే వారెంత బాధపడతారో నాకు తెలుసు కానీ నేనేం చేయను? ఒకరి భార్యనయి వుండీ, మరో వ్యక్తిపై అభిమానాన్ని పెంచుకోవటమే పాపం కదా నిజానికి.

మౌనాన్ని భంగం చేస్తూ అన్నారు విశ్వమిత్ర. "మనం ఉదయమే వెళ్ళిపోవాలి. నువ్వు తయారవు జయా!" అని, నాకేం జవాబు చెప్పాలో తోచలేదు. జరగవలసిందే జరుగుతుంది. అడ్డుపడే శక్తి నాకేదీ?

* * *

చక్రవర్తి స్టేషన్‌కి వచ్చి ట్రెయిన్ ఎక్కించారు మమ్మల్ని. నిజానికి నాకు అమ్మగారు వచ్చేదాకా వుండాలనే వుంది. కానీ ఎందుకో ఈ పరిస్థితిలో ఆవిడ ముఖాన్ని చూడగలనన్పించలేదు. అందుకే ఉదయం బయలుదేరమంటే మారుమాట్లాడకుండా తయారయాను.

ట్రెయిన్ కదిలేముందు, స్నేహితుడితో కరచాలనం చేస్తున్న చక్రవర్తి ముఖంలోని భావాలు నా మనసును కలచి వేసాయి. ఆయన్తో ఎన్నో చెప్పాలనీ, అనునయించాలనీ ఉంది నాకు. కాని అవకాశమేది? కాలమే ఆయన మనసుకయిన గాయాన్ని మాన్పాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ కూచున్నాను. కంపార్ట్‌మెంట్‌లో ఇంకెవరయినా ఎక్కితే బావుణ్ణు అనుకున్నాను.

నా ఆలోచనకి నాకే నవ్వొచ్చింది- జీవితమంతా ఆయన్తో గడపవలసి వుండగా, ఈ కాస్త ప్రయాణంలో ఏకాంతానికే భయపడుతున్నానే- అని.

రైలు కదిలింది. చేయి వూపుతూ, చివరిసారిగా నావయిపో సారి చూసి వెళ్ళిపోయారు చక్రవర్తి.

అది ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్. మేము తప్ప ఇంకెవరూలేరు. చుట్టూ ఓసారి కలయజూసి, విశ్వం వయిపు చూశాను. ఆయన నావయిపే వింతగా చూస్తున్నారు. ఏమని మాట్లాడతారో, ఎలా జవాబు చెప్పాలో కూడా తెలియలేదు నాకు.

"బాగా గుర్తుచేసుకుని చూడు జయా! నన్నెక్కడయినా చూసినట్లయినా అన్పించటం లేదూ? నా ముఖం చూస్తే నీ మనసులో ఏమీ కదలిక లేదూ? ఇన్నేళ్ళ మన స్నేహాన్ని, అయిదేళ్ళ వివాహ జీవితాన్ని పూర్తిగా మరిచి పోయావంటే నిజంగా నమ్మలేకుండా వున్నాను."

నాకోపం వచ్చిందాయన మాటలకి. "అంటే ఏమిటి మీరనేది? నటించాల్సిన అవసరం నాకులేదు. నిజంగా మీరెవరో నాకు తెలీదు. దైవసాక్షిగా మిమ్మల్నెప్పుడూ చూసిన గుర్తైనాలేదు."

"సారీ జయా! అయామ్ వెరీసారీ. నా బాధలో ఏవేవో అని

నిన్ను బాధిస్తున్నాను కదూ....పోనీ భవిష్యత్తు గురించి నువ్వే మనుకుంటున్నావో అదైనా చెపుతావా?"

వెంటనే జవాబు చెప్పలేక పోయాను. కారణం ఏం చెప్పాలో తోచకపోవటమే. కొన్ని క్షణాలు ఆలోచించాను.

"ఏమో ఏం చేయాలో నాకైతే ఏమీ అర్థం కావటం లేదు. భవిష్యత్తు గురించి ఎలా ఆశించాలో కూడా నాకు తెలీదు. నాకు తెలిసిందొక్కటే. వర్తమానంలో జీవించటం. మీకూ నాకూ పెళ్ళయిందనీ మీరు నా భర్తనీ అంటున్నారు. ఎప్పటికయినా అన్నీ గుర్తు చేసుకోగలిగితే దేవుడిదయ. లేదా జీవితాంతం మీ భార్యగా నటిస్తాను." అన్నాను.

అన్న తరవాత గానీ 'నటిస్తాను' అని ఆయన మనసు నెంత నొప్పించానో తెలియలేదు.

దెబ్బతిన్నట్లుగా చూస్తూ, "అంత మాటనకు జయా! నువ్వు నా ముందు నటించాల్సిన అవసరం లేదు. అంతా గుర్తు తెలిసాకే నన్ను భర్తగా అంగీకరిద్దువుగానీ, అయితే కొంతవరకూ నటించటం కూడా నీకు తప్పదులే. ఇంతవరకూ నీకు చెప్పనేలేదు నేను. మనకో బాబు వున్నాడు. వాడి ముందు వాడికి అమ్మగా వుండ గలిగితే చాలు."

దిమ్మెరపోయాన్నేను. నాకో కొడుకు కూడాను? భార్యగానే కాదు, అమ్మగా కూడా నటించాల్సిన రాతరాసి వుందన్నమాట. సరే! ఇహ తప్పేదేముంది? తప్పుచేసిన వాడిలా తలవంచుకుని వున్నారాయన. నేనేం చేయను. నాకేమీ తెలియదన్న నిజాన్ని అబద్ధం ఎలా చేయను? భగవాన్ నువ్వే నాకు దారి చూపించాలి.

నాకు తల్లిదండ్రులనే వాళ్ళు కూడా ఉన్నారో, లేదో తెలుసుకోవాలన్పించింది. కానీ ఆయన ముఖం చూస్తే అడగాలన్పించ లేదు. చాలాసేపు మవునంగానే గడిపామిద్దరం.

ఇంతలో ఆయనే అన్నారు. "నిన్ను జయని పిలవటం కూడా నీకిష్టమో కాదో...." నవ్వొచ్చింది నాకు. "నన్ను జయని పిలిచినా, సంధ్యన్నా, మరో పేరుతో పిలిచినా ఒకటే. కారణం నా

పేరేమిటో నాకసలు తెలియదుగా" అన్నాను నవ్వాలో ఏడవాలో తెలియని దానిలా.

"బాబుని గురించి ఏమయినా చెప్పండి" అన్నాను. అమ్మలా నటించాల్సిన దాన్ని నా కొడుకుని గురించి తెలుసుకోవాలిగా?"

"బాబుకి నాలుగేళ్ళుంటయ్. చాలా మటుకు నా పోలికలుంట యని అందరూ అంటారు. అంత ఎక్కువగా అల్లరిచేసే టయిప్ కాదుకానీ, తనేదయిగా అనుకున్నాడంటే మాత్రం సాధించే రకం.... అయినా వాణ్ణి గురించీ, వాడి అలవాట్ల గురించీ, వాళ్ళమ్మకి తెలిసినంతగా నాకేం తెలుసు? ముందు నించీ నాకంత టచ్ లేదు వాడితో....ఇక ఇప్పట్నించీ అలవాటు చేసుకోవాలి..." తనలో తనే గొణుక్కుంటున్నట్లుగా అన్నారు. ఆయన్ని చూస్తే జాలివేసింది నాకు.లోపల్లోపల ఎంత బాధ అనుభవిస్తున్నారో! ఓహ్! ఒక వంక చక్రవర్తినీ, మరో వయిపు ఈయన్నీ బాధ పెట్టి నేను బావుకుంటున్నదేమిటి?

కనీసం సానుభూతి మాటల్తో అయినా ఆయన్ని ఓదార్చా లనిపించింది. "గతాన్ని గుర్తు చేసుకోటానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. నాక్కొంచం టయిమివ్వండి" అన్నాను.

"పోనీలే జయా! నా అదృష్టం యింతే ననుకుంటాను. అనవ సరంగా ఎక్కువగా ఆలోచించి మనసు పాడు చేసుకోకు. నువ్వు మనిషిగా నా ముందు తిరుగుతూంటే చాలు. సంతృప్తి పడతాను" ఆయన మాటలు వింటూ, బెర్త్‌మీద ఎప్పుడు నిద్రపోయానో నాకు గుర్తులేదు.

టాక్సీ ఓ యింటిముందాగింది. ఆ బిల్డింగ్‌ని తేరిపారజూస్తూ కిందికి దిగేసరికే గేటు తెరుచుకుని ఓ పదిహేనేళ్ళ కుర్రాడు బయటి కొచ్చి కుతూహలంగా నా ముఖంలోనికి చూస్తూ, లగేజ్ తీసుకో సాగేడు.

"పని కుర్రాడు—గోపీ" అన్నారు ఆయన మెల్లిగా. నేనేమీ మాట్లాడించ నందుకేమో, డిసప్పాయింట్ అయినట్లు కనిపిస్తూ లోపలకెళ్ళిపోయాడు ఆ అబ్బాయి. కనీసం, "బావున్నావా గోపీ"

అనయినా అని వుండాల్సిందేమో అనుకున్నాను.

ఆయన వెంట ఇంట్లో అడుగు పెట్టేసరికి, ఓ నాలుగేళ్ళ బాబు పరిగెత్తి వచ్చి, "మమ్మీ! మమ్మీ!" అంటూ నా కాళ్ళకి చుట్టుకున్నాడు. అభ్యర్థిస్తున్నట్లుగా నా వయిపు చూశారు విశ్వం. యాంత్రికంగా చేతులు చాపి ఎత్తుకున్నాను.

వాడి వెనకాలే, గబగబా వచ్చారు దాదాపు యాభై యేళ్ళాయన ఒకరు. ప్రశ్నార్థకంగా విశ్వంవయిపు చూశాను. "నాన్నగారు" అన్నారు, నాకు మాత్రమే వినిపించేలా. అయినా ఆయనకి వినిపించిందిలావుంది, మొదట ఆయన ముఖంలో కనిపించిన ఆనందం మాయమయింది.

"దాబాబూ! అమ్మకిన్నాళ్ళూ జబ్బుచేసిందిగా. మరి ఎక్కువగా వేధించొద్దు. దా నా దగ్గరికి" అని నిర్లిప్తంగా అంటూ చేతులు జాపారు.

బాబు నా మెడచుట్టూ చేతులువేసి రానన్నట్లు తల తిప్పాడు. "పోనీ వుండనివ్వండి...." అన్నాను. మామయ్యా అనాలని కూడా అనలేకపోతూ.

ఓ గది గుమ్మం వయిపుగా చూపులు తిప్పి, నువ్వా గదిలోకెళ్ళొచ్చు' అన్నట్లుగా చూశారు విశ్వం. బాబు నెత్తుకునే ఆ గదిలోకెళ్ళాను. అలసటగా అక్కడున్న ఓ మంచం మీద కూచుని బాబుని దింపి పక్కన కూచోబెట్టుకున్నాను.

బాబు నిజంగా భలే ముద్దుగావున్నాడు. ముఖంమీద పడుతున్న జుట్టుని తోసుకుంటూ, కళ్ళని చక్రల్లా తిప్పుతూ నా వయిపే చూస్తున్నాడు. ముఖంలో విశ్వం పోలికలూ, ఒడ్డూ పొడుగూలో వాళ్ళ నాన్నగారి పోలికలూ కొట్టొచ్చినట్లుగా కనిపిస్తున్నయ్.

"ఏమిటి బాబూ అలా చూస్తున్నావ్? మీ మమ్మీనా కాదా అని?" అన్నాను చిరునవ్వుతో.

"అబ్బ! ఎన్నాళ్ళయింది మమ్మీ నిన్ను చూసి. మనకేం కావలసినా దేవుణ్ని ప్రార్థిస్తే వస్తాయని నువ్వు చెప్పేదానివిగా అప్పుడు, అందుకని రోజూ ప్రార్థిస్తున్నా మమ్మీ నువ్వు తొరగా

కావాలని" అన్నాడు మెచ్చుకోలును కోరుకుంటున్నట్లుగా చూస్తూ.

"వెరీగుడ్ అందుకేగా మరి నేనొచ్చేసింది. నేలేనప్పుడు తాతయ్యని బాగా అల్లరి పెట్టేవాడివా?" అన్నాను. అంత చక్కగా ఎలా నటించగలుగుతున్నానా అని నాలో నేను ఆశ్చర్యపోతూ.

"అబ్బే లేదు మమ్మీ. కావాలంటే తాతయ్యనే అడుగు. నేనెంత గుడ్ బాయ్‌నో చెపుతాడు" బాబింకా ఏదో చెబుతూనే వున్నాడు.

బయటేదో మాటలు గుసగుసగా వినిపిస్తుంటే అటువైపె వెళ్ళింది నా దృష్టి. "అయితే విశ్వం, అమ్మాయికేమీ గుర్తులేదా? నిన్ను కూడా గుర్తుపట్టలేదా!"

"ఉహూ! ఏమడిగినా గుర్తు లేదంటూంది."

"అయితే మరి బాబు.........."

"బాబుముందు తల్లిలా ప్రవర్తించమని నేనే రిక్వెస్ట్ చేసుకున్నాను."

తరవాతింకేమీ విన్పించలేదు. అంతలో విశ్వం లోపలికొచ్చాడు.

"బాబీ! నువ్వువెళ్ళి ఆడుకోమ్మా. మమ్మీ స్నానం అదీ చేయద్దూ" అనగానే ఇష్టం లేకున్నా వెళ్ళిపోయాడు బాబు.

"స్నానం చేద్దువుగానీ లే. అదో అటువయిపుగా వున్నదే బాత్‌రూమ్" అని చూపించారు.

స్నానం చేస్తే కాస్త రిలీఫ్ అన్పించింది. తల దువ్వుకుని ఇంకేం చేయాలా అని మంచం మీద ఆలోచిస్తూ కూచున్నాను. పక్కనే మరో గదిలో వున్నట్టున్నారు విశ్వం. రెండింటికీ మధ్యనో తలుపువుంది.

చీకటి పడి చాలా సేపయింది. టయిమెంతయిందో నాకు తెలియలేదు. బాబు పరుగెత్తుకొచ్చాడు. "మమ్మీ ఆకలేస్తోంది" అంటూ. అవతలి గదిలోంచి వస్తూ 'గోపీ' అని కేకేశారు విశ్వం. పరిగెత్తొచ్చాడు వాడు. "చూడు బాబుకి ఆకలేస్తోందట. అన్నం పెట్టెయ్యి" అన్నాడు.

అప్పుడే నా చంకనెక్కిన బాబు, "ఉహు రోజూ గోపీనేగా. బోర్ డాడీ. ఇవాళ మమ్మీ తినిపించాలి కదూ। ఏం మమ్మీ" అన్నాడు 'ఊ' అన్నట్లు చూస్తూ. మాటలయితే మాట్లాడుతున్నాగానీ, చేతుల్లో ఆ పనివాడిముందు ఎక్కడ బయటపడతానో అని భయం లోలోపల నాకు. అయినా వాడి కోరిక కాదనలేకపోయాను. తల్లినుండి రెండు నెలల ఎడబాటు వల్లనేమో నన్ను అంటిపెట్టుకునివుండాలనీ, ఒక క్షణమయినా దూరంగా వుండలేనట్లుగా వున్నాడు వాడు.

ఏమయితే అయిందని, "పద బాబూ నేనే తినిపిస్తాను" అన్నాను. "మమ్మీ భలే మంచిది" అంటూ అడక్కుండానే మెడ చుట్టూ చేతులేస్తూ బుగ్గమీద ముద్దుపెట్టుకున్నాడు బాబు. అదోలా అనిపించి ఎదురుగావున్న విశ్వంవయిపు చూశాను. ఆయనసలు నావయిపే చూడటం లేదు.

వెళ్తున్న గోపీవెంట డైనింగ్ రూమ్‌కి నడిచాను.

"ఏమన్నం పెట్టను బాబూ।" అన్నాను బాబునెత్తి టేబిల్ మీద కూచోబెట్టూ.

"పోమమ్మీ. అన్నీ మరచిపోయావు నువ్వు. పొద్దుట చారన్నం, రాత్రి మజ్జిగన్నం కాదూ నేను తినేది?" అన్నాడు.

"అరేరే. మర్చేపోయాను." అంటూ, గోపీ ఇచ్చినప్లేటులో, టేబిల్ మీదే వున్న అన్నం, కొంచెం పెరుగూ పడ్డించి కలిపాను. ఒక్కో ముద్దే అందిస్తూంటే ఆవురావురుమన్నట్లుగా తిన్నాడు బాబు. అది ఆకలివల్లకాదు. మమ్మీ తినిపిస్తోంది అనే ఇష్టంవల్ల అని తెలుస్తోనే వుంది.

బాబు భోజనం అయాక, మిగిలిన ముగ్గురం కలిసి భోంచేశాము. మధ్యలో ఒకసారి, విశ్వం నాన్నగారు "అమ్మాయి నోసారి స్పెషలిస్ట్‌తో చెకప్ చేయిస్తే మంచిదేమో విశ్వం" అన్నారు నా ముందు అలా అడగటంలో నా అంగీకారం కూడా తీసుకుంటున్న అర్థం వుందనిపించింది నాకు. "అలాగే నాన్నా" అన్నారు విశ్వం.

అంతకు మించి ఎవరమూ ఏమీ మాట్లాడుకోలేదు.

రాత్రి బాబుకి నా మంచం పక్కనే మరో మంచం పక్కా

...శాడు గోపీ. చాలాసేపు విశ్వం గదిలోంచి కనిపిస్తున్న లయిటు వెలుగును చూస్తూ వుండిపోయాన్నేను. ఎప్పుడు నిద్రపోయానో గుర్తులేదు.

ఎప్పుడో మెలకువ వచ్చి చూసుకుంటే బాబు తన మంచం వదిలేసి వచ్చి నా పక్కనే మీదో చెయ్యీ కాలూ వేసి పడుకుని వున్నాడు. మెల్లిగా వదిలించి అవతలి మంచం మీది పడుకో బెడదామా అనిపించింది. మళ్ళీ ఎందుకో వూరికే అయిపోయాను. ఇంతలో పక్కగది తలుపు తీసిన చప్పుడయింది. చప్పుడు లేకుండా మెల్లిగా వచ్చి అల్లంత దూరంలో కొన్ని క్షణాలపాటు నిలుచుని, మావయిపే చూస్తుండి పోయారు విశ్వం.

మేలుకునే వున్నా ఏం చేస్తారో చూద్దామని కదలకుండా పడుకునే వున్నాను. అప్పుడు నాచేయి బాబు చుట్టూవేసి వుంది.

తరవాత మెల్లిగా వెనుదిరిగారాయన. బాబు నిద్రలో ఏదో కలవరించ సాగాడు. నేను కొద్దిగా బాబుని కుదిపి, మళ్ళీ పడుకో బెట్టుకున్నాను. మళ్ళీ నా మెడచుట్టూ చేతులువేసి నిద్రపోయాడు వాడు. అంతా చూస్తున్న విశ్వం "బాబుని తీసికెళ్ళి నాదగ్గర పడుకో బెట్టుకుంటానివ్వు" అన్నారు చేతులు చాపుతూ.

''వద్దు. ఉండనివ్వండి'' అని ఇక మాట్లాడే తావియ్యకుండా కళ్లు మూసుకున్నాను. ఆయన వెళ్ళిపోయారు.

* * *

రోజులు గడుస్తున్నయ్. బాబుతో బాగా అలవాటయి పోయింది నాకు. స్నానం చేయించటం, డ్రస్ చేయించటం, భోజనం పెట్టటం అన్నీ నేనే చేసేదాన్ని. రాత్రికూడా రోజూ నాదగ్గిరే పడుకునేవాడు, అప్పుడప్పుడూ కథ చెప్పమని వేధించేవాడు. నాకొచ్చిన పిచ్చి కథలేవో చెప్పేదాన్ని.

విశ్వంతోగానీ, వారి నాన్నతోగానీ ఎక్కువగా మాట్లాడేదాన్ని కాను. అవసరమూ కనిపించేదికాదు. వారి నాన్నమాత్రం, అప్పుడప్పుడూ, ''నువ్వొచ్చాక బాబు తాతయ్యని పూర్తిగా మరిచి పోయాడమ్మా'' అనేవారు. ఆయనేదో బిజినెస్ చేస్తారనుకుంటాను.

ఏం బిజినెస్సో తెలీదుకానీ. రోజూ పొద్దుట స్నానం. టిఫిన్ తీసుకో వటం అయాక వెళ్ళి. మధ్యాహ్నం ఏ రెండింటికో వచ్చేపారు. అప్పుడప్పుడూ ఎవరోవచ్చి మాట్లాడి వెళుతుండేవాళ్ళు.

విశ్వం పొద్దుట ఆఫీసుకెళ్తే సాయంత్రమే వస్తారు. అందరం కలిపి భోంచేయటం రాత్రే. ఈ మధ్యలో బాబుని ఓ నర్సరీ స్కూల్లో చేర్చారు వాళ్ళ డాడీ. గోపీవెళ్ళి వదలిపెట్టటం, భోజనం పెట్టి రావటం చేస్తూండేవాడు.

ఆ మధ్యనోసారి నన్ను స్పెషలిస్టుకి చూపించారు. ఆయనేవో కొన్ని టెస్ట్లూ, ప్రశ్నలు వేయటం చేశారు. కానీ చివరగా ఆయ నేమని రిజల్ట్ చెప్పారో విశ్వంని నే నడగలేదు. ఆయన నాకు చెప్పనూ లేదు.

వంటావిడ రోజూవచ్చి వంటచేసి వెళ్ళేది. ఏంచేయాలో మాత్రం నేనే చెప్పటం. ఒక్కమాటలో చెప్పాలంటే, ఆ ఇంట్లో విశ్వం భార్యగా తప్ప, మిగతా అన్ని విషయాల్లో ఆ ఇంటి యజమానురాలినయి పోయాను.

ఉన్నట్లుండి ఒక రోజెందుకో విశ్వం ఆఫీసుకి వెళ్ళలేదు. పొద్దుట లేవటం కూడా ఆలస్యంగా లేస్తే వంట్లో బాగులేదేమో అనుకున్నాను. కానీ ముఖం మాత్రం కొంత గంభీరంగా ఉండే తప్ప, తేటగానే ఉంది. టిఫిన్ చేశాక తన రూమ్లోనే వుండి పోయారు.

భోజనం అయాక. "అలా ఒకసారి మన మామిడితోటకి వెళ్ళాలనుకుంటున్నాను. నాతో రావటానికి నీకేమయినా అభ్యంత రమా?" అన్నారు.

నాకూ రొటీన్ లైఫ్తో కొంత విసుగ్గానే వుంది. అందుకని సరేనన్నాను. , ఇద్దరం కలిపి మోటార్ బైక్మీద బయలుదేరాము. అలా ఆయన వెనక కూచుని వెళుతుంటే, చక్రవర్తితో కారులో వెళ్ళిన జ్ఞాపకాలే మనసులోకి వస్తున్నయ్.

బైక్ని తీసికెళ్ళి నేరుగా ఓ చిన్న పెంకుటింటి ముందు ఆపారు విశ్వం. అది గెస్ట్హౌస్ అనుకుంటాను. చుట్టూ దట్టంగా

పెద్ద పెద్ద మామిడి చెట్లుండటం వల్లనేమో. ఒక బిల్డింగ్ ఉన్నట్టు కూడా బయటికి తెలియటంలేదు.

నేను చక్రవర్తి దగ్గర్నించీ వచ్చినది మొదలు మేమిద్దరం కలిసి ఇలా బయటికి రావటం ఇదే మొదటిసారి. ఇందులో ఏదో ప్రత్యేకార్థమూ, అభిప్రాయమూ ఉండకపోదని నా మనసు చెబుతూంది. ఏదయినాసరే ఎదుర్కోవాలనే వచ్చాను ఆయన వెంట.

ఒకసారి తోట అంతా తిప్పి అన్నీ చూపెట్టారు. ఎన్నిరకాల చెట్లున్నదీ, ఎంత ఆదాయం వచ్చేదీ చెప్తూతూ, పంప్‌సెట్టూ, తోటకి నీళ్ళు సప్లైచేసే బావీ చూపించారు. తోటలోవున్న కాపలాదారూ, ఒకరిద్దరు కూలివాళ్లు మమ్మల్ని చూపి దండం పెట్టారు. అంతా చూడటం అయాక గెస్ట్‌హౌస్‌లోకి వెళ్ళాము.

అందులో వున్నది రెండు గదులు, ఒక బాత్‌రూమ్. ఒకటి డ్రాయింగ్ రూమ్‌లాగా కుర్చీలవీ వేసి వున్నయ్. మరో దాంట్లోంచి రెండు మంచాలు కనిపిస్తున్నయ్. డ్రాయింగ్ రూమ్ షెల్ఫ్‌లో వున్న జ్యూస్ బాటిల్ ఒకటితీసి, కూజాలోవున్న మంచి నీళ్ళతో రెండు గ్లాసుల జ్యూస్ కలిపి నాకొకటిచ్చి తనొకటి తీసుకున్నారు. విశ్వం. ఇదంతాదేనికి ఉపోద్ఘాతమో నాకర్థం కాలేదు. ఏం చెబుతారో చూద్దాం అన్నట్లు, నిదానంగా జూస్ సిప్ చేయసాగేను.

"నాకోసం ఒకపని చేయగలవా జయా?" అన్నారు సడన్‌గా చేతిలోని గ్లాస్‌తీసి టీపాయ్‌మీద పెడుతూ. ఆయనేం చేయమంటారో ఊహించలేకపోయాను. ఏదయినా నాకు వీలుకానంత పనిచేయమని అడగరనిపించింది. సరేనన్నట్లు తల ఊపాను.

మెల్లిగాలేచి, మూలగావున్న ఒక బీరువా తెరిచారు. అందులో చాలామటుకు బట్టలున్నట్లున్నయ్. ఇంట్లో వాళ్ళు ఎప్పుడయినా ఇక్కడకొస్తే నైట్ హాల్ట్‌చేసినా సరిపోయేలా అవి ఉంచారను కుంటాను. పై అరలోంచి కొన్ని డైరీల్లాంటి పుస్తకాలు బయటికి తీసి పట్టుకొచ్చి టీపాయ్‌మీద నాముందుంచారు. ప్రశ్నార్థకంగా ఆయన ముఖంలోకి చూశాను.

"అప్పుడప్పుడూ గతాన్ని గురించిన జ్ఞాపకాల గురించి, నీకు

చెబుతూ వుండమని అవాళ నీకు చెకప్ చేసిన డాక్టర్ చెప్పారు.. ఎన్నోసార్లు నీతో చనువుగా మాట్లాడాలనీ, గతంలో మనం కలిసి పంచుకున్న జ్ఞాపకాల గురించి నీకు కథలుగా చెప్పాలని అనుకున్నాను. కానీ ప్రయత్నించలేకపోయాను. నీతో ఫ్రీగా మాట్లాడాలంటేనే నాకేదో బెరుగ్గా వుంటుంది.

"ఎంతో ఆలోంచి ఈ నిర్ణయానికి వొచ్చాను. నాకై నేనేమీ చెప్పలేనని తెలిసిపోయింది. కనీసం ఈ డైరీలు అయినా నీకు చదవమని ఇవ్వాలనుకున్నాను. అవి చదివేటప్పుడు నీకు బోర్ కొట్టకుండా ఉండేందుగ్గాను, తోటలో అవుతే వాతావరణం బావుంటుందని ఇక్కడికి తీసుకొచ్చాను నిన్ను.

"నాక్కాస్త అలసటగావుంది. కాస్సేపు రెస్ట్ తీసుకుంటాను. నీకు బోర్ కొట్టనంతదాకా చదివి, నన్ను పిలు. ఇంటికి వెళ్ళిపోదాం" అంటూ నా జవాబుకోసం చూడకుండా, బీరువాలోంచి లుంగీ ఒకటి తీసుకుని అవతలి గదిలోకి వెళ్ళిపోయారు.

పుస్తకాలన్నీ చేతుల్లోకి తీసుకుని, మెల్లిగా గదివదిలి గుబురుగా చెట్లున్న ఒక మూలకి నడిచాను. అక్కడో చెట్టు మొదలు నానుకుని కూచుని పుస్తకాలన్నీ ఒకసారి తిరగేశాను. మొదటి పుస్తకం తీయగానే ఉలిక్కిపడ్డాను. ఇంతదాకా ఇవి విశ్వం డైరీలనే అనుకుంటున్న నాకు, అందులో మొదట్లోనే, "జయలక్ష్మి" పేరు కనిపించింది. 'ఓహ్! అయితే ఇవన్నీ, ముందు జన్మలాంటి నాగతంలో నేను రాసుకున్న డైరీలన్నమాట. భలే బావుంది. చదివి చూస్తాను—!' అనుకుని చదవటం మొదలుపెట్టాను. అందులో ఎందరో వ్యక్తుల పేర్లూ, ఎన్నో సంఘటనలూ ఉన్నయ్‌గానీ, విశ్వంతో సంబంధంవున్న విషయాలని చదవమనే అయన ఉద్దేశం కదా! మొదట అవి మాత్రమే చదువుదాం-అనుకుని పేజీలు తిరగేశాను.

* * *

ఏవేవో తేదీలు, ఎన్నెన్నో జ్ఞాపకాలు. ఏవీ నా మనసుని మాత్రం కదిలించలేక పోతున్నయ్. అక్కడక్కడ కొన్ని పేజీల

దగ్గిర కాస్త ఆగి నిదానంగా చదవసాగాను.

.... .... .... .... ....

చిన్ననాటి నేస్తం విశ్వంని గురించి అమ్మ చెబుతూండటం వల్ల నాకు బాగానే గుర్తుంది. ఇవాళ అదే విశ్వం కాలేజిలో కొత్త మేష్టారుగా దర్శనమిచ్చి, తనే గుర్తించారు. అబ్బ! ఆయనకి ఎంత గుర్తుంది నన్నుగురించి. జయా! జయా! అంటూ ఎన్ని కబుర్లు చెప్పారో కాలేజినించీ ఇంటి కొచ్చేలోగా.

అమ్మతో మాట్లాడేక నన్ను వాళ్ళింటికి తీసుకెళ్ళారు. వాళ్ళ నాన్నగార్ని చూడాలని ఎంతో వుత్సాహంగా వెళ్ళాను. కానీ ఆయనెందుకో నా రాకనంతగా ఆహ్వానిస్తున్నట్లుగా కనిపించక కాస్త నీరుగారిపోయాను-కానీ అంతలో విశ్వం మాటల్లో పడి అన్నీ మరిచిపోయాను.

.... .... .... .... .... ....

ఇవాళ జనవరి ఫస్టు. నా పుట్టిన రోజుకూడా. అదేపనిగా గుర్తుపెట్టుకుని వచ్చారు విశ్వం విషెస్ చెప్పటానికి. ఏదైనా ప్రెజంటేషన్ తెస్తారేమో ననుకున్నాను. కానీ ఏమీ లేకపోయేసరికి క్షణం పాటు నిరుత్సాహపడినా మళ్ళీ సర్దుకున్నాను.

నన్ను మాట్నీకి తీసికెళ్తానని అమ్మని అడిగారు విశ్వం. 'మీ ఇష్టం' అంది అమ్మ. అమ్మ కొనిపెట్టిన కొత్తచీర కట్టుకుని వెళ్ళాను అతడివెంట. "ఏ సినిమాకి'' అనడిగాను బైక్ ఎక్కగానే. "చూస్తావుగా నువ్వే?'' అని నవ్వుతూ స్టార్ట్ చేశాను.

సినిమా థియేటర్లన్నీ దాటిపోతున్నా ఎక్కడా ఆపలేదు. క్రమంగా వూరుదాటి నిర్మానుష్యంగా వున్న రోడ్డుపయికి వచ్చాము. ''ఇదేమిటి? సినిమాకని ఇలా తీసుకొస్తున్నార''న్నాను. వెనక్కి తలతిప్పి, 'నిన్ను కిడ్నాప్' చేస్తున్నా అన్నారు చిలిపిగా.

పక్కుమని నవ్వుతూ, 'నన్ను కిడ్నాప్‌చేస్తే మీకేమొస్తుంది? నేనే లక్షాధికారి కూతుర్నీ కాదే' అన్నాను. 'ఏమొస్తుందో చెబుతాను ముందు మాతోట రానివ్వు' అన్నారు, తలవెనక్కి తిప్పకుండానే.

అప్పుడు గుర్తొచ్చింది వాళ్ళకిప్రాంతాల్లో ఎక్కడో ఒక

మామిడితోట వుండాలని. 'అయితే ఇవాళ వెళుతున్నది అక్కడి కన్నమాట' అనుకున్నాను. సినిమాకు వెళ్ళలేదే అన్న డిసపాయింట్ మెంట్‌ని తోటలో ప్రవేశించగానే మర్చిపోయాను. విశ్వం తోటంతా తిప్పి చూపుతుంటే. చిన్నపిల్లలా గెంతులేస్తూ తిరిగాను. 'చిన్నప్పటి పిలకజడల పిల్లలా కనిపిస్తున్నా వివాళ' అన్నాడతను.

తోట చూద్దం అయాక, గెస్ట్‌హౌస్‌కి తీసికెళ్ళి కూచోబెట్టి. బుట్టలోంచి పామును తీస్తున్న మంత్రగాడిలా జేబులోంచి చిన్నపెట్టె నొకటి బయటికి తీశారు. ఏం జరుగుతున్నదీ నేను తెలుసుకునేలోగా ఒక్క క్షణంలో అందులోంచి ఒక ముత్యపు ఉంగరాన్ని తీసి నాచేయి అందుకుని వ్రేలికి తొడిగారు విశ్వం.

ఇంతవర కెప్పుడూ, అతను నాతో అంత చనువుగా ప్రవర్తించలేదు. అందుకని 'ఏమిటిది' అంటూ గబాలున చేయి లాక్కుని కోపంగా చూశానతనివయిపు. అంతలోనే చిన్నబుచ్చుకుని మరో జేబులోంచి చిన్నడైరీ ఒకటితీసి నా వళ్ళోపడేసి, మరో కుర్చీలో కూచున్నారు సీరియస్‌గా ముఖం పెట్టుకుని.

డైరీ తీసి చూశాను. మొదటి పేజీలో ఇలా రాసివుంది. "చిన్ననాటి నేస్తం. ప్రాణానికి ప్రాణం అయిన జయని, నా జీవితానికి వెలుగుకమ్మని కోరుతూ-ప్రేమతో విశ్వం" అనిరాసివుంది. ఆ అక్షరాలు అలా చదువుతుండగానే నా మనసులో ఏదో సంచలనం ప్రారంభమయింది. వద్దనుకుంటూనే నాలుగయిదుసార్లు ఇష్టంగా చదువుకున్నాను ఆ లైన్లని.

ఇంతవరకు విశ్వంని గురించి ఎప్పుడు నేనిలా ఆలోచించ లేదు. అయినా ఆ మాటల్ని చదువుతోంటే నా మనసులో కలుగుతున్న చలనాన్నిచూస్తే, నాకు తెలీకుండానే నేనూ అతని ప్రేమని కోరుతున్నానేమో అనిపించింది.

తలెత్తి విశ్వంవయిపు చూశాను. అతనింకా ఎటో చూస్తున్నాడు. డైరీ టేబిల్‌మీద వుంచి లేచి అతడి వెనకాల ఒక్కక్షణం నిలుచుని, మెల్లిగా భుజాలమీద చేతులేసి, 'ఎందుకు మేష్టారూ అంత కోపం?' అన్నాను.

రెండుచేతులూ పట్టి దగ్గరకు లాక్కుంటూ అన్నాడు "ఫో రాక్షసీ నువ్వెప్పుడూ అంతే. ముందు పొగరుచూపి నన్ను రెచ్చ గొడతావు. కోపగిస్తే మళ్ళీవచ్చి కాళ్ళు పట్టుకుంటావు." అని బుంగమూతి పెట్టి 'సరేగాని నేను బహుమతి ఇస్తే తీసుకోవటమే గానీ, నాకేమీ ఇవ్వవా?' అన్నారు.

'నా దగ్గరేముం దివ్వటానికి?' అన్నాను.

"ఒక్కోసారి నువ్వంటే నాకిష్టం విశ్వం-అని అనకూడదూ?"

"ఓహో! నువ్వంటే నాకెందుకో అంత ఇదీ—అని పాట పాడేవా" అన్నాను రాగం తీస్తూ.

ఈ పుట్టినరోజు జీవితంలో ఇంత మరపురాని రోజవుతుందని నేనూహించనే లేదు.

................

విశ్వంకి స్టేట్ బాంక్‌లో ప్రొబేషనరీ ఆఫీసర్‌గా సెలక్షన్ వచ్చింది. ఇవాళ మధ్యాహ్నం కాలేజి స్టూడెంట్స్ ఫేర్‌వెల్ పార్టీ ఇచ్చాము. రేపే ఆయన ట్రయినింగ్‌కి వెళ్ళాలిసుంది. సాయంత్రం ఇంటికొచ్చి సినిమాకు వెళదాం రమ్మన్నారు. ఈ మధ్యలో అమ్మకి ఆరోగ్యం బావుండలేదు. అయినా కాస్సేపు అతనితో ఏకాంతంగా మాట్లాడాలనే కోరికతో వెంట వెళ్ళాను.

సినిమాకు వెళ్ళాక ఒక అరగంటయాక అన్నారు. "ఏఁవిటి జయా అదోలా వున్నావు?" అని.

నేను పలకలేదు. మళ్ళీ రెట్టించేసరికి అన్నాను—'మీకు తెలీనట్లు అడుగుతారే?'

"ఓహ్! అదా పిచ్చిదానా. ట్రెయినింగ్ అంటే ఎన్నాళ్ళను కున్నావు? తొమ్మిది నెలలేగా! మధ్యలో రాకుండా, నీకు లెటర్స్ రాయకుండా వుంటానా."

అయినా నేనేమీ జవాబియ్యలేదు.

'ఏదో ఒకటి మాట్లాడు; నవ్వు; అలావుండకు. నేవెళ్ళాల్సింది రేపేగా? నువ్విలా దిగులుపడితే నేనెలా వెళ్ళేది? నా ట్రెయినింగ్ అయి, పోస్టింగ్ ఆయ్యేలోగా నీ బియెస్సీకూడా అయిపోతుంది.

అప్పుడింక నాన్నగారి పర్మిషన్ తీసుకోవటం, అమ్మాయిగార్ని పెళ్ళాట్టమేగా?....అదో అప్పుడే సిగ్గుపడిపోతున్నావ్....నవ్వాలి మరి' అంటూ నా భుజంచుట్టూ చేయివేసి దగ్గరికి లాక్కున్నారు.

చిన్నగా నవ్వుతూ, నా తలని అతని భుజానికి ఆన్చి కొద్దిసే పుండి పోయాను అలాగే.

.... .... .... ....

అమ్మ ఆరోగ్యం పూర్తిగా అధ్వాన్నం అయిపోయింది. ఆవిడ స్కూల్‌కెళ్ళి మూడు నెలలు అవొస్తూంది. డబ్బుకి చాలా ఇబ్బందిగా వుంది. అయినా విశ్వం కీ విషయాలేమీ తెలపలేదు.

ప్రతీ వుత్తరంలో అమ్మకి ఎలా వుందో తెలపమనీ, డబ్బే మయినా కావలసివస్తే సంశయించవద్దనీ రాస్తూనే వుంటారు అతను. కానీ వున్నదున్నట్టు రాస్తే అనవసరంగా నా గురించి దిగులు పడతా రనిపించి ఏమీ రాయలేకపోతున్నాను.

.... .... .... ....

అయిపోయింది. అమ్మకూ నాకూ అనుకోలేనంత దూరం ఏర్పడిపోయింది.

వెంటనే ఏం చేయాలో తెలియక ఏడుస్తూ కూర్చున్న నన్ను ఇరుగు పొరుగు వాళ్ళు పరామర్శించారు. విశ్వం అడ్రస్ అడిగి తీసు కుని, టెలిగ్రాం ఇచ్చారు. నాకు కాళ్ళూ చేతులూ కట్టేసినట్లుంది. భవిష్యత్తు అంధకారమేనా అనిపిస్తూంది.

.... .... .... ....

టెలిగ్రాం అందగానే విశ్వం రాబట్టి సరిపోయింది. అంతా సవ్యంగా జరిగిపోయింది. ధైర్యం చెప్పటానికి ఆయనే తోడు లేక పోతే నేనేమయిపోయేదాన్నో.

"అలా ఏడుస్తూ కూర్చుంటే లాభం లేదు జయా! రేపట్నుంచీ కాలేజికి వెళ్ళు. చదువులో మనసు లగ్నం చేసి దుఃఖాన్ని మరచి పోవటానికి ప్రయత్నించు" అన్నారు.

'ఉహూ నావల్లకాదు. నేనిక చదవలేనండీ' అన్నాను.

'అదికాదు జయా నే చెప్పేది కాస్త అర్థం చేసుకో. నీ బాధ.

దుఃఖం నాకు తెలుసు. నీ కిప్పుడు ధైర్యంచెప్పే తోడుకావాలి. నిజానికీ క్షణమే నిన్ను పెళ్ళిచేసుకుని నా వెంట తీసుకెళ్ళాలనుంది నాకు.

'కాని ఆ పని నా ట్రయినింగ్ అయాక చేస్తే మంచిదేమో అనిపిస్తూంది. అంతలోగా నీ పరీక్షలూ అవుతాయి. అంతదాకా నువ్వు హాస్టల్లో జాయిన్ అవ్వు. అప్పుడప్పుడు నేవచ్చి చూసిపోతుంటాను.'

నాకేం చెప్పాలో తోచలేదు. తలవంచుకుని పరధ్యానంగా కూచునివున్నాను. చుబుకంపట్టి తల పైకెత్తుతూ, 'నువ్వలా వుంటే నాకేం చేయాలో తోచలేదు జయా. చెప్పు నన్నేం చెయ్యమంటావు: ఒంటరితనాన్ని భరించలేననిపిస్తే చెప్పు. ఏది ఏమయినా జరగనీ, ఇప్పుడే నాన్నగారి ఆశీర్వాదం తీసుకుని నిన్ను పెళ్ళి చేసుకుంటాను. ఏదో ఒకటి మాట్లాడు జయా ప్లీజ్' అన్నారు.

'అహా! మీరుచెప్పిందే బాగుంది. హాస్టల్లోజేరుతాను మరి....'

'డబ్బు విషయం నాకు వదిలెయ్యి. ఇప్పుడు నా దగ్గర కొంత డబ్బువుంది. ఇది తీసుకుని హాస్టల్ ఫీజు, ఎగ్జామ్ ఫీజు కట్టెయ్యి. నేను వూరెళ్ళి మళ్ళీ పంపుతాను. ఏం సరేనా?'

ఈ పరిస్థితిలో నా కతను తప్ప సలహా చెప్పేవాళ్ళు, సహాయ పడేవాళ్ళు మాత్రం ఎవరున్నారు?

.................

పరీక్షలు బాగానే రాశాను. పాసవుతానని నమ్మకం వుంది. విశ్వం రేపు వస్తున్నట్లు ఉత్తరం రాశారు. విశ్వం స్నేహమే లేక పోతే, ఉన్న ఒక్క దిక్కు అమ్మపోయాక నా బ్రతుకేమయుండేదో!

.................

ఆత్రంగా ఎదురుచూస్తున్న నాకు విశ్వం ముఖం చూడగానే భయం వేసింది. చాలా దిగులుగా అదోలా వున్నారు అతను. తనే చెబుతారని కాస్సేపు చూశాను. ఇంక ఆత్రుత పట్టలేక, 'ఏమిటలా వున్నారు?' అడిగాను.

"సారి జయా! ఇలా జరుగుతుందని నేననుకోలేదు. ఎంతో సంతోషంగా నిన్ను మా ఇంటి కోడలిగా తీసికెళ్ళాలని అనుకున్నాను. కానీ నా ఆశ నిరాశ అయింది. మొదటి నించీ నాన్నకి

మన స్నేహం అంత ఇష్టం లేదని నాకు తెలుసు గానీ గట్టిగా అడిగితే కాదనరనే భరోసాతో ఉన్నానిన్నాళ్ళు. కానీ ఆయనకు బొత్తిగా మన పెళ్ళి అంగీకారం కాదలి తెలిసిపోయింది.

"ఆయన ఈ వేళిడో వూరు వెళ్ళాలని ప్రయాణం అవుతుంటే మన విషయం ప్రస్తావించాను. తన అయిష్టాన్ని స్పష్టంగా తెలియజేస్తూ, తన మాట వినేలా అయితేనే, తనకూ నాకూ సంబంధం వుంటుందనీ, లేని పక్షంలో తను వచ్చేలోగా ఇల్లు వదిలి వెళ్లొచ్చనీ తెగేసి చెప్పి వెళ్ళిపోయరు" తల వంచుకుని విశ్వం చెపుతున్నారు. నాకు కళ్ళనిండా నీళ్లొచ్చాయి.

"నావల్ల ఇతడికూ్కడా కష్టాలు పెడుతున్నాను. నా కోసం వారు తన తండ్రిని వదులుకోవటమా!" అనుకున్నాను.

కళ్ళనీళ్ళ నాపుకుంటూ, అదే చెప్పానాయనికి "ఛః ఏం మాటలవి. ఒకరివల్ల ఒకరు కష్టాలు పడటం ఏమిటి? ఏ నాడు నిన్ను నా జీవిత సర్వస్వంగా ఎంచుకున్నానో, అప్పుడే నావీ నీవీ అంటూ కష్టసుఖాలు వేరుగా చూడటం మరచిపోయాన్నేను. ఉన్న విషయం చెప్పాను. ఆయన అంగీకారంతో మా ఇంట్లో గౌరవంగా, అడుగు పెట్టాలని నువ్వు ఆశించివుంటావు కదాని చెప్పటానికి నేనింత బాధ పడుతున్నాను అంతే.

"ఏదేమయినా నిన్ను దూరం చేసుకునేది లేదు. నువ్వు తయారుగా వుండు. ఎల్లుండి పొద్దున్నే ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లు నేను చూస్తాను. నేరుగా తిరుపతికి వెళదాము. తరువాత మనకంటూ ఒక గూడు ఏర్పరచుకోలేక పోము. నువ్వేమీ దిగులు పెట్టుకోకు. నువ్వు సంతోషంగా వుంటే నా కెంతో ధైర్యంగా వుంటుంది. ఏమయినా చెయ్యగలను....మరి నే వెళ్లొచ్చేదా" అంటూ నా చేతిని పట్టి చిన్నగా నొక్కి వెళ్ళిపోయారు.

............

ముచ్చటగా మూడు గదుల యిల్లు! మాకిద్దరికీ సరిగ్గా సరిపోయింది. రెండురోజులుగా హోటలు భోజనం తిన్నాము. ఇవాళే కావలసినన్నీ తెచ్చి వంట మొదలుపెట్టాను. ఇవాళ నించీ ఆయన

బాంక్‌కి వెళుతున్నారు.

ఒక్కదాన్నే కూచుని ఆలోచిస్తుంటే జరిగిందంతా ఓ కలలా అనిపిస్తుంది. ఆ శ్రీనివాసుని సన్నిధిలో మా పెళ్ళి జరుగుతున్నంత సేపూ, అమ్మవచ్చి ప్రత్యక్షంగా దీవిస్తున్నట్లే ఎన్నోసార్లు ఫీల యాను. కానీ లోపల్లోపల కొరతగానే వుంది. పెద్దవారు మామయ్య అనుమతిలేకుండా జరిగిపోతున్నదే—అని. నాకే ఇలావుందే ఇంక విశ్వం ఎంత బాధ పడుతుంటారో!

ఇక్కడికొచ్చాక ఈ రెండు రోజులూ ఆయన ప్రేమలో నేను మాత్రం సంతోషంగానే వున్నా. ఆయన వారి నాన్నగారి జ్ఞాపకాలు దాచుకుని పైకి నవ్వుతున్నారనే అనిపిస్తుంది నాకేమో!

…… …… …… …… ……

అబ్బ! ఇవాళెంత సంతోష వార్త విన్నానో! మామూలు ముందే ఆయనింటి కొస్తే ఏఁవిటబ్బా విశేషం అనుకున్నాను.

"జయా త్వరగా తయారవు. మన వూరికి వెళ్ళిపోదాం. అర్జెంట్" అన్నారు హడావిడిగా. "అసలు సంగతేమిటో చెపుదురూ" అన్నాను.

"మన అదృష్టం తిరిగిందోయ్. నాన్నగారికి మనమీద దయ కలిగిందోచ్. ఇవాళ బాంక్‌కి ట్రంకాల్ చేసి చెప్పారు. ఇద్దరూ కలసి ఇంటికొచ్చెయ్యండని. వారంలోగా ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్ వచ్చేలా ట్రయి చేస్తున్నానని కూడా చెప్పారు. రాత్రి ట్రెయిన్‌కే వెళ్ళిపోదాం. ఏం?" అన్నారు.

నేనేమంటాను! నాకు గుండెల మీంచి పెద్ద బరువు తీసేసి నట్లుంది.

…… …… …… ……

మామయ్యకెలాగో మామీద కోపం తగ్గి తిరిగి రమ్మన్నారను కున్నానే గానీ ఇంటికి వచ్చేదాకా అసలు విషయం తెలియలేదు. ఆయన కొడుకుని వదలిపెట్టి వుండలేక రాజీపడి రమ్మన్నారనే గానీ, నా మీద మాత్రం కోపం అలాగే వున్నట్లుంది. ఇంటికొచ్చి మూడు రోజులయినా నాతో ఒక్క మాటా మాట్లాడలేదు. అసలు

నాకు ఎదురుపడకుండానే తప్పించుకొంటున్నారు..

శ్రీవారెంత ప్రేమగా చూసుకుంటున్నా నాకుమటుకు వెలితిగానే వుంది. ఎప్పటికయినా నేనాయన కోపం పోగొట్టి, తన కోడలిగా అంగీకరింప జేసుకోగలనా అనిపిస్తుంది.

................................

విశ్వం కాంపువెళ్ళి మూడు రోజులవుతుంది. నాకు వంట్లో నలతగా వుంటుంది. పోనీ డాక్టర్ దగ్గరికి వెళ్ళి చూపించుకుందామా అనిపించింది. ఇక్కడికి కొచ్చినప్పట్నించీ ఒకటి రెండుసార్లు విశ్వం వెంట సినిమాలకి తప్ప నేను ఇల్లువదలి బయటికి వెళ్ళింది లేదు. ఇవాళ డాక్టర్ దగ్గరకు వెళ్ళాలన్నా మామయ్య నడిగి వెళితే మంచిది కదా అనిపించింది.

ధైర్యంచేసి మెల్లిగా ఆయన గదిముందుకివెళ్ళి నిలుచున్నాను. అలికిడయిందేమో 'ఎవరది?' అన్నారాయన. 'నేను' అన్నాను.

"ఏం కావాలి" అన్నారు.

"ఇవాళ నేను డాక్టర్ దగ్గరకు వెళ్ళాలనుకుంటున్నాను మామయ్యా! వంట్లో కాస్త....

వెలుపలి కొచ్చారు. "అలాగే వెళ్ళు. మన ఫామిలీ డాక్టర్ డిస్పెన్సరీకి ఫోన్‌చేసి చెబుతాను. రేపుపొద్దుటే గోపీని తీసుకుని వెళ్ళు" అనేసి వెళ్ళిపోయారు. ఆయన అంతమాత్రం మాట్లాడిందానికే నేనెంతో సంతోషించాను.

................................

డాక్టర్ దగ్గరికి వెళ్ళొచ్చాను. నా అనుమానం నిజమయింది. ఈక్షణంలో అమ్మవుంటే ఎంత సంతోషించేదో! కనీసం ఈ వార్తని ఆయనకీ, మామయ్యకీ చెప్పే వాళ్ళుకూడా లేరు. నేనే చెప్పుకోవాలిక—అనుకుని బాధపడుతూ కూచుని వున్నాను.

సాయంత్రం ఇంటికొచ్చిన మామయ్య హడావిడిగా మాగది దగ్గిరికొస్తూ, "అమ్మాయ్! ఇప్పుడే డాక్టరుగారు చెప్పారీ విషయం. నేవిన్నది నిజమేనా తల్లీ" అన్నారు సంభ్రమంగా. ఆయన సంతోషాన్ని చూస్తే నాకు ఆశ్చర్యం వేసింది. నిజానికి ఈవార్తవిని ఆయ

ంత సంతోషిస్తారని నేననుకోలేదు. అవునన్నట్లు తల వూపాను.

"పోనీలే. మా మనవుడు పుట్టకముందే తాతయ్య కోపం పోగొట్టాడు, ఇంక పుట్టినాక ఇల్లంతా వెలుగుతో నింపుతాడేమో! చూడమ్మాయ్!....డాక్టర్ ఇచ్చిన చీటీలు నాకివ్వు. మందులూ, టానిక్సూ అన్నీ తెప్పిస్తాను....నీకేం కావలసినా అన్నీ చేయించుకుని బాగా తిను" అంటూ వచ్చినంత వేగంగానూ వెళ్ళిపోయారు. నాకు కలా, నిజమా అని అనుమానం వేసింది.

.... .... .... .... .... ....

అలా ఎంతసేపు చదువుతూ వుండిపోయానో. విశ్వం లేచి డ్రస్ చేసుకుని వచ్చి, "ఇంటికి వెళదాం రా జయా బాబు వచ్చుంటాడు" అని పిలిచేసరికి ఉలిక్కిపడి ఆయన ముఖంలోకి చూశాను. ఆయన అలాగే చూస్తున్నారు. ఉహూ! నా స్మృతిపథంలో ఏమీ మార్పులు కదలటంలేదు.

డైరీల్లో చదవాల్సింది చాలావుంది. నిదానంగా చదువుకోవచ్చని. "పదండి. వెళదాం" అని ఆయన్ను వెంబడించాను.

• • •

బాబుమీద చేయివేసి పడుకుని ఆలోచిస్తూ నిద్రపోవటానికి ప్రయత్నిస్తున్నాను.

విశ్వం ఇచ్చిన డైరీలన్నీ చదివాను. ఎంత చదివినా ఏదో చదివినట్టే వుందికానీ. అది నా కథే అనుకోలేక పోతున్నాను. అవి చదివితే నాలో ఏదయినా మార్పు ఉంటుందని ఆశించారేమో. నేను నిర్లిప్తంగా ఉండిపోయేసరికి ఈమధ్య విశ్వం చాలా దిగులుగా కనిపిస్తున్నారు. ఆఖరికి బాబునికూడ దగ్గరికి తీసుకోవటంలేదు.

నాది మరీ అర్థంలేని జీవితం అయిపోతూంది. నాకు సంతోషం లేదు. నావల్ల ఆయనకీ ఆనందంలేదు. ఇక్కడికొచ్చి నేను చేయగలిగిందొక్కటే మంచిపని__అది బాబుకి తల్లిగా దగ్గిరవటం. అసలు ఈమధ్య ఇంట్లో ఎక్కువసేపు గడపటమేలేదు విశ్వం. పొద్దుట వెళ్ళితే రాత్రెప్పుడో వస్తారు, వచ్చేసరికి ఆయన పరిస్థితి కూడా బాగుండటంలేదు. డ్రింక్స్ అలవాటు చేసుకుంటున్నారేమో

అని నా అనుమానం. ఏదెలా జరిగినా నేను చేయగల, అడ్డు పడగల హక్కు నాకేముంది?

విశ్వం గది తలుపు చప్పుడవుతే ఆలోచననించీ తేరుకుని అటుచూశాను. తలుపు తెరుచుకుని ఈ గదిలోంచి బాత్‌రూమ్‌కి వెళ్లారు. మళ్ళీ తిరిగి వస్తుంటే బెడ్‌లయిట్ వెలుగులో ఆయన వయిపే చూస్తున్నాను. కాస్త దూరం రాగానే సడన్‌గా తూలి కింద పడ్డారు. గబాలున బాబు చేతులు వదిలించుకుని మంచం దిగాను. కానీ ఏం చేయాలో తోచలేదు.

చూస్తూ వుండలేకపోయాను. ఏమయితే అయిందని, వెళ్ళి చెయ్యిపట్టి మెల్లిగా లేపాను. అతికష్టంమీద లేచి నిలుచుని నా భుజం చుట్టూ చేయివేశారు. నాకేమిటోగావుంది. అలాగే వదిలేసి పరిగెత్తి పోదామా అన్పించింది. అలాగే నిగ్రహించుకుని మెల్లిగా అవతలి గదికి నడిపించాను. మంచంమీద కూచోబెట్టగానే, కళ్లు మూసుకునే మంచినీళ్ళు కావాలని సైగచేశారు. కూజాలోంచిగ్లాస్‌లో నీళ్ళు తెచ్చాను. కానీ అయనంత ఆయన తాగగల రనిపించలేదు.

దిండ్లకి ఆనుకుని జారగిల బడిపోయున్న ఆయన్ని మెల్లిగా లేపి గ్లాస్ అందించాను. ఎప్పుడు నీళ్లుతాగి గ్లాస్ వదిలేశారో, ఎప్పుడు నన్ను దగ్గరికి లాక్కున్నారో నాకు తెలీదు. నేను ఉలికి పాటునించీ తేరుకునేసరికి నేనాయన కౌగిట్లో వున్నాను.

విడిపించుకుందామనిపించింది. కానీ అందుకు ప్రయత్నించ కుండా నన్నేశక్తి ఆపిందో నాకు తెలీదు. ఆయనేదో పిచ్చిగా మాట్లాడుతున్నారు. "జయా?....నా ప్రాణమా!....ఎన్నాళ్ళు నన్నిలా ఏడిపిస్తావ్?....నన్ను నిజంగా గుర్తించలేక పోతున్నావా!....నీ ప్రేమలేని బ్రతుకుని నేనేం చేసుకోను?....నన్ను దూరం చేయకు.... ఎప్పటిలా నీ ఒడిలో దాచుకో...." అని తడబడుతున్నారు.

ఆ మాటలని వింటుండగానే నా మనసులో జ్ఞాపకాల తెర లేవో తొలగి పోతున్నట్లనిపించింది. ఆయన చేతుల్లో మైనపు బొమ్మలా వుండిపోయాను. ఆయన మరింత గట్టిగా తన చేతులు బిగించటం, ఏదో మత్తుగా అనిపించటం మాత్రమే నాకు గుర్తుంది.

..ళ్ళ స్పృహవచ్చి కళ్ళు తెరిచేసరికి తెల్లవారుతోన్నట్లు కిటికీలోంచి వస్తున్న చిరు వెలుగులు తెలుపుతోన్నయ్. నాకు ఎన్నో సంవత్సరాలపాటు నిద్రపోయి మేల్కొన్నట్లుంది. ఆ నిద్రలో ఏళ్ళ తరబడీ జరిగిన సంఘటన లెన్నో నిమిషాల్లో నా కళ్ళముందు కదిలి పోయాయి. ఆ కదిలిపోయిన జ్ఞాపకాలనింకా గుర్తుచేసుకుంటూనే పక్కకి తిరిగి చూశాను.

పక్కనే కుర్చీలో తలవంచుకుని కూచుని వున్నారు విశ్వం. "ఏవండీ ఏమిటలా వున్నారు?" అన్నాను చేయిజాపి ఆయన చేతికి అందుకోవటానికి ప్రయత్నిస్తూ. ఆయన అవాక్కై తలఎత్తి నా కళ్ళలోకి చూశారు. నన్ను క్షమించు జయా! రాత్రి నేనెంత పిచ్చి వాడిలా ప్రవర్తించాను! నీకేమీ కోపంలేదూ నామీద? నువ్వాలా స్పృహ తప్పిపోతే, నా రాక్షసత్వంతో నిన్నేం చేశానో అని ఎంత తల్లడిల్లిపోయానో? ప్రామిస్! ఇంకెప్పుడూ ఇలా జరగదు. నన్ను వదిలి దూరంగా మాత్రం పారిపోకు...."

"ఛాల్చాల్లెండి. ఏదో కొంప మునిగిపోయినట్లు ఏమిటా మాటలు? ఇప్పుడు నాకేమయిందని, ఇంతగా క్షమాపణలు చెప్పు కుంటున్నారు?" అంటూ లేచి మంచం దిగాను.

ఆయన అయోమయంగా చూశారు నా వయిపు. "అయితే.... అయితే....నన్ను గుర్తించావా జయా నువ్వు....నేన్ని భర్తననీ అంగీకరిస్తావా?...." అంటూ సంకోచంగా నా చేతులు రెండూ తన చేతుల్తో పట్టుకున్నారు.

నేనేమీ మాట్లాడకుండా ఆయన కళ్ళలోకి సూటిగా చూశాను. ఆయనకి నా కళ్ళలో ఎలాంటి భావం కనిపించిందో గానీ గబాలున చేతులుపట్టి తనవయిపు లాక్కున్నారు.

"ఎన్నాళ్ళ నన్ను వేధించి చంపావు? ఉండు నీపని చెబు తాను...." అని ఇంకా ఏమో అనబోతుండగానే, బాబులేచి "మమ్మీ....మమ్మీ...." అంటూ గది గుమ్మం దగ్గిరికి వచ్చేసాడు. గబాలున ఆయన వడిలోంచి లేచి వింతగా మావయిపే చూస్తున్న బాబుని ఎత్తుకునివాడి ముఖాన్ని పదేపదే ముద్దు పెట్టుకున్నాను.





